# విషయానుక్రమణిక




డాన్ క్విక్ సెట్
వెల రూ. 2-0-0

కాంచన ద్వీపం
వెల 1-8-0
పోస్టుఖర్చులు ప్రత్యేకం.

ఆంధ్రగ్రంథమాల,
మద్రాసు 1.





కరచరణాద్యవయవముల
థర ముడిగెన్; వళులు మొగముపై నిండా
రెన్, శిరసిల్ల దెల్లవారెను,
దరిమాలిన తృష్ణయొకడె తరుణతబూనెన్

తా॥ చేతులు, కాళ్లు మొదలైన అవయవముల పట్టు వసలుచున్నది. ముఖముమీద ముడుతలు ఏర్పడినవి. తల యావత్తు నెరిసి తెల్లబడింది. కాని, అంతులేని ఆశ ఒక్కటి మాత్రము తరుణవయస్సును పొందుచున్నది.

ముఖముమీదముడుతలు ఏర్పడుతున్నాయి అంటే జీవితంలో చాలా మనోవ్యాకుల తలపాలై సుఖదుఃఖములనే తరంగముల దెబ్బలు తిన్నాడని అర్థము. ఈ తరంగముల దెబ్బలు మనిషికి తగిలితగిలి తల పగిలిపోయిన వాళ్ళుకూడా ఉన్నారు. కాని చాలా మందికి ఆ కష్టపరంపరల తరంగచిహ్నములే యీ ముఖం మీది ముడతలన్నట్లుగా ఏర్పడతాయి యౌవనంలో ఉన్నవానికి ముఖారవిందం ముడుతలు లేకుండా అద్దం లాగున ఉంటుంది. అయితే, యౌవనంలో ఉన్నటువంటివానికి తత్పూర్వం బాల్యదశలో కొన్ని ఆశలు నిరాశలై యుండవచ్చు స్కూలు ఫైనలుపరీక్షలో తానుతలంచినన్ని హెచ్చుమార్కులు వచ్చియుండకపోవచ్చు. స్కూలు ఫైనలు ప్యాసయినా, కాలేజీలో సీటు లభించియుండకపోవచ్చు. అటువంటి ఆశాభంగములు అనేకం విద్యార్థిదశలో సంభవించి అనేక విధాలుగా యువకుడైనవాని యుత్సాహమును కొంత విరిచివేస్తాయి. అందాకా ఎందుకు? ఏవో కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు పరీక్షలో తప్పకుండా వస్తాయని బాగా అనుమానించి ఆ ప్రశ్నలకే ప్రత్యుత్తరములను పట్టుదలగా వ్రాసి బట్టీవేసి పరీక్షకు వెళ్లితే, ఆ ప్రశ్నలు ఏవిన్నీ పరీక్షా పత్రంలో కన్పించక, తాను నిర్లక్ష్యంచేసిన గ్రంథ భాగంలోనే కొన్ని యితర ఘట్టాలను గూర్చిన ప్రశ్నలు పరీక్షలో రావడం కలదు. అటువంటి సందర్భంలో పరీక్షకు హాజరైన విద్యార్థి పరీక్షహాలులో తెల్లమొగము వేసి తెల్లజెండా పైకెత్తినట్లుగా తెల్లకాగితాలు మడతబెట్టి పరీక్షహాలులో సమర్పించి రావలసివస్తుంది. అంతకన్నా ఆ విద్యార్థిదశలో అనుభవించదగిన కష్టంగాని, మనోవ్యాకులత గాని మరొకటి ఉండదు. యిటువంటి కష్టాలు అనుభవించినప్పటికీ, ఆ యౌవన దశలో ముఖంమీద ముడుతలు ఏర్పడడం లేదు –

ఒక్కొక్క రోజున విద్యార్థికి స్కూలులో యిచ్చిన లెక్కలు ఎట్లా చెయ్యాలో తెలియక అడ్డమైన చిక్కుల పాలవుతాడు. క్రాసువర్డ్ పజిల్ (లుప్తాక్షరీ చతురం సమస్య) సాధించినట్లుగా రోజంతా ఆలోచనచేసి అవస్థపడినప్పటికీ, ఆ లెక్కను ఏవిధంగా చెయ్యాలో దారి కన్పించదు. దారి కన్పించినప్పటికీ, సరియైన సమాధానంతో లెక్క సొంతంకాదు ఈ విధంగా ఆల్జీబ్రా లెక్కలుచేసి ఆ బీజగణితంతో బేజారైన పిల్లవాళ్లు చాలామంది ఉన్నారు – "మావాడు తెనుగు పాఠం ఇంగ్లీషు పాఠం బాగానే చదువుతాడు. కాని, లెక్కలలోనే కొంత వెనుకంజ వేస్తాడండీ!" అనే ప్రస్తావన ఎంతమంది పిల్లల విషయంలో ఎందరు తల్లిదండ్రులు తరచు చేస్తూ ఉంటారో లెక్కలువేసి చూచినట్లయితే, ఆ లెక్కకు మనమే ఉక్కిరి బిక్కిరి అయిపోతాం – "విద్యార్థికి లెక్కలు బాగా శీర్షంకాకపోవుటకు, కారణం ఏమిటండీ" అని ఏ డాక్టరునైనా పెద్దవాళ్లు ఎన్నడయినా అడిగి చూచినారా? లేదు. విద్యార్థులకు గణితశాస్త్రం ఘటితి గిట్టకపోవుటకు గల మూలకారణం ఏమిటి? అది గణితశాస్త్ర లోపమా? గణితశాస్త్రమును బోధించే పద్ధతి యందు లోపమా? విద్యార్థి లోపమా? ఈ లోపాలలో పాలు అందరికీ ఉన్నదా?

దాసు వామనరావు

"చేట 1 కి 6 పెన్నీల చొప్పున 5 చేటల ఖరీదెంత?" ఎన్ని పెన్నీలైతే ఒక షిల్లింగు అవుతుందో విద్యార్థికి తెలియాలి. ఈ పెన్నీల మానం తెలియకపోతే క్లాసులో అవమానం అవుతుంది అయినా, చిన్న కుర్రవానికి చేటలఖరీదును పెన్నీల మానంలో లెక్క కట్టించడం విద్యాబోధనావిధానమునకే అవమానం అని గ్రహించలేక, చాలాకాలము విద్యాధికారులు తమ విద్యను బ్రిటిష్ ద్రవ్యమానంలో విక్రయించారు అటువంటి లెక్కల పుస్తకములను వ్రాసిన వారూ, అచ్చువేసినవారూ, పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించిన వారూ, బోధించిన వారూ, విద్యార్థులను యీ గణితశాస్త్రంలో అనవసరంగా నలగకొట్టి చితుకకొట్టి హింసించినటువంటివారైనారు గాంధి మహాత్ముని పుణ్యమువల్ల అహింసామార్గం అమలులోకివచ్చి, విద్యావిధానంలోకూడా పై జెప్పిన హింసామార్గం పోయింది పౌనులు షిల్లింగులు పెన్నీలు అనేవి విద్యార్థి ఎన్నడైనా చూచినాడా? చూడవలసిన అగత్యం ఉన్నదా? రూపాయీలు అణాలు పైసలు అనేవి చూస్తే చాలునని తపించే విద్యార్థికి యీ భారతీయ లక్ష్మి ప్రసన్నంకూడా కన్నుల కరవుతీర ఎన్నడైనా అయిందో లేదో — ఆ విద్యార్థియొక్క తల్లిగాని తండ్రిగాని పిల్లవాడు సెనగపప్పు బటానీలు కొనుక్కొనుటకై యిచ్చిన అర్థణాతో వాని అర్థశాస్త్రజ్ఞానం ప్రారంభమవుతుంది చిల్లర శ్రీ మహాలక్ష్మి అన్నట్లుగా ఆ చిల్లర డబ్బుల సందర్శనంతోనే యీ భారతలక్ష్మి ప్రసన్నం ప్రారంభమవుతుంది అటువంటి విద్యార్థికి ఆంగ్ల లక్ష్మి ప్రసన్నంగాని అమెరికను లక్ష్మి ప్రసన్నంగాని కలిగే అవకాశం లేనప్పుడు, ఆ లక్ష్మి ప్రసన్నంతో కూడినటువంటి గణితశాస్త్ర సరస్వతీ ప్రసన్నం ఏవిధంగా అవుతుంది? "లెక్కలలో మీవాడు వెనుకబడి ఉన్నాడండీ!" అని చాలామంది పిల్లలనుగూర్చి చాలామంది ఉపాధ్యాయులు తల్లిదండ్రులతో అంటూవుంటారు ఈ ఆలాపన యింత పరిపాటిగా ప్రతి పాఠశాలలోనూ విన్పిస్తూ ఉండడంవల్ల నిజంగా లెక్కలలో వెనుకబడిన జాతి విద్యార్థులా? ఉపాధ్యాయులా?

హోటలులో ఏదైనా ఒక కూర వండినప్పుడు, ఆ హోటలులో భోజనం చేసిన వారిలో ఎక్కువమందికి అది రుచించలేదనే యెడల, ఆ లోపం ఆ కూరలో ఉన్నదా? హోటలులో భోజనం చేసిన భోక్తలలో ఉన్నదా? అది శాకపాకలోపంగాని, భోక్తభుక్తిలోపం కాదు విద్యావిధానంలో ఉన్న లోపాన్ని చూపించగల్గినవాళ్ళు విద్యార్థులే అని అంగీకరించక తప్పదు

నాలుగో తరగతి చదివే కుర్రవానికి దశాంశముల లెక్కలను బోధించినందువల్ల ఆ గణితశాస్త్రానికీ ఆ విద్యార్థికీ వచ్చిన మహర్దశ ఏమిటి? మహర్దశాంశ లేమిటి? యకరానికి 100 సెంట్లు అనే లెక్కకు తప్ప, సేతు శీతనగపర్యంతం, బాల్యదశ దాటేవరకు, దశాంశములతో ఏవిధమైన అవసరమూ లేదు. అటువంటిసందర్భంలో యీ ప్రైమరీ పాఠశాలలందు పిల్లవాని మేధస్సును పీల్చి పిప్పి చేసేటటువంటి యీ దశాంశముల వేధ ఎందుకో దాశరథీ కరుణాపయోనిధీ!

ఇన్ని విధాలుగా లెక్కలేనన్ని చిక్కులు కల్పించెడి లెక్కలలో ఉక్కిరిబిక్కిరియై బిక్కమొగము వేసెడి విద్యార్థి నిరంతర చింతాక్రాంత చేతస్కుడైనప్పటికీ, ఆ పిల్లవాని ముఖము ముడుతలు పడదు కారణం ఏమిటంటే, అసలు ఆ లెక్కలమీదనే వానికి మక్కువ లేదు దానిమీద వానికి అభిమానం లేదు దానివలలో వాడు చిక్కకొనకుండా చరిత్రగాని, విజ్ఞానశాస్త్రంగాని అభిమాన శాస్త్రంగా అధ్యయనం చేస్తానంటాడు గణితంవైపుకు కన్నెత్తి చూడనంటాడు అది గణిక (వేశ్య) వంటిదంటాడు తాను దానితో ముడిపెట్టుకుంటే, పరీక్షలోనూ క్లాసులో పదిమందిలోనూ తనకు అవమానం అవుతుందంటాడు

కాని, నిజంగా పెరిగి పెద్దవాడైన తర్వాత గణికావ్యామోహంలో పడినట్లయితే, అప్పుడు, తాను గడించిన ధనమును ఇంధనమువలె తగులబెట్టినట్లయితే, అప్పుడు తన మోహాంకం ఔ ఆగణికయొక్క ద్రవ్యదాహం అమితమైనదని గ్రహిస్తాడు. రూపాయలసముద్రమును ఆపోశన పట్టగల అపూర్వ అగస్త్య ప్రభావం ఆటవెలదికి ఉన్నది అటువంటి అర్థాబ్ధికన్యను (పణ్యాంగనను) తృప్తిపరచవలెనంటే, లక్ష్మీ పతియైన శ్రీ మహావిష్ణువునకే సాధ్యం కావాలి

లక్ష్మిని నమ్ముకొని ఉన్నటువంటి వాళ్లకు కూడా, లక్ష్మి చంచల అని తెలియును అయిశ్వర్యం ఎన్నాళ్ళు? ఆవుపాడి ఎన్నాళ్ళు? అన్నట్లుగా, యీయేడు పాడిపంటలు బాగాఉన్నాయంటే వచ్చేఏడు ఎట్లాఉంటాయో? ఏయేటి కాయేడు పంచాంగం త్రిప్పిచూచి కందాయ ఫలములు లెక్కకట్టవలసిందే అందువల్ల లక్ష్మి కటాక్షమును నమ్ముకొని ఆమె కొంగు తగిలితే చాలు కోటిబంగారం అన్నట్లుగా తపించేటటువంటి వాళ్ళకు అనగా ఈ చంచలను ధ్యానంచేస్తూ ఉపాసన చేసేవాళ్ల మనస్సు చంచలమయ్యేటట్లు చేస్తుంది సముద్రంలోని కెరటాలమీద ఊగియాడినట్లుగా ఆ ఉపాసకుడు ఊగులాడుతూ ఉంటాడు. సంసార సాగరంలో కన్పించేది ధనలక్ష్మి తప్ప మరొక లక్ష్మి ఏమీ లేదు మనిషికి తలవెండ్రుకలన్నీ తెల్లబడినట్లయితే, అది వార్ధక్యం చేతనే అని వాదిస్తారు కాని, పై పద్యంలో చెప్పిన విషయాన్ని బట్టి చూస్తే, అది ఆ తృషవల్లనే క్షీరసముద్రరాజతనయ యైన లక్ష్మినే జపించి, లక్షాధికారి కావాలనిన్నీ, లక్ష్మికే అధికారి కావాలనిన్నీ తపించి ఆ క్షీరసముద్రంలో మునిగి తేలుతూ ఉండడంవల్లనే తలంతా తెల్లబడిందని తేటతెల్లమవుతోంది ఈ ఆర్థిక సముద్రంలో యీదడంవల్లనే కరచరణాది అవయవములపట్టు తప్పి

## మనదేశం

### సెప్టెంబరు 17:

రాజాజీ "కర్నూలులో ఆంధ్ర రాష్ట్ర స్థాపనోత్సవాలు అద్భుతంగానే వుంటాయి అయితే మనం అప్పుడే పండగ హుషారులో పడి పోకూడదు భ్రమ మాత్రమైన (ఆంధ్రులు, తమిళుల) వియోగాని కింకా కొన్నిరోజులు వ్యవధి ఉందని మరచిపోవడం నాకిష్టంలేదు (ఆంధ్ర కాంగ్రెస్ సభ్యులకూ ఆంధ్ర ప్రభుత్వోద్యోగులకూ హితవు)

### సెప్టెంబరు 15

ఆంధ్రరాష్ట్రం విడిపోయినప్పుడు పరిశిష్ట (మద్రాసు) రాష్ట్రంలో ఏర్పడనున్న ఆహారసమస్యను వివరిస్తూ 'మద్రాసు' ప్రభుత్వం భారతప్రభుత్వానికి లేఖవ్రాసినట్లు తెలుస్తున్నది

* * *

### మద్రాసు, సెప్టెంబరు 14:

శ్రీమతి రాజలక్ష్మి అమ్మాళ్ అనే యువతి (30 సం॥) తన భర్త నరసింహయ్యగారితో సహా సినిమా చూస్తూ, తెరమీద సుబ్రహ్మణ్యస్వామి ప్రత్యక్షమవగానే తన్మయురాలై 'సమాధి'లో పడిపోయింది ఆమెకు ఎప్పటికీ మెలకువ రాకపోయే సరికి ఆమెను కూర్చొన్న బెంచీతోసహా మోసుకొని వచ్చి ఆరు బయట వుంచారు.



ఐక్యరాజ్యసమితి ఎనిమిదో సమావేశపు అధ్యక్షతకు ఎన్నుకోబడిన ప్రథమ మహిళ, భారతదేశ ప్రతినిధి, శ్రీమతి విజయలక్ష్మి పండిట్.

## ★ కాలక్షేపం ★

పోతోంది. ఈ ఆర్థిక సముద్ర తరంగముల తాకుడువల్లనే ముఖముమీద ఆ తరంగముల వంటి ముడుతలు ఏర్పడుతున్నాయి. పాల సముద్రంలో ఉన్న లక్ష్మికోసం అనేక అవస్థలపాలు కావడంవల్లనే, తలంతా తెల్లబడింది. ఈ మార్పు అంతా దేనిమూలంగా జరిగినదంటే, లక్ష్మి అనేది ఎక్కడో పాలసముద్రంలో దూరంగా ఉన్నదని భ్రమించి ఆ లక్ష్మివెంట బడుటవల్ల సంభవించింది.

సుఖమైన జీవితం అంటే, పలు సుఖములైన జీవితసౌకర్యాలు కావాలి. అన్నవస్త్రం, ఇల్లువాకిలీ, పాడిపంటలు, భార్యాబిడ్డలు, సిరిసంపద, పిల్లలకు చదువు సంధ్యలు, మందులుమాకులు, రైళ్లు బస్సులు, తంతి తపాలా వగైరా సౌకర్యాలుఉండాలి. ఇల్లు అన్నతర్వాత, తృణకాష్ఠ జలసమృద్ధి ఉండాలి. కుళాయి ఉండాలి. ఎలెక్ట్రిక్కు దీపాలు ఎలెక్ట్రిక్కు వీవనలు ఉండాలి. పింగాణీ చేసిన పాయఖానాలుఉండాలి. ఇంట్లో టెలిఫోను, రేడియో ఉండాలి. మనకు కారు ఉండాలి. రోడ్లకు తారు ఉండాలి. చలికీ ఎండకూ చలించకుండా సమశీత శయనమందిరం ఉండాలి. ఎండా కాలానికి అయిస్ కాఫీ, శీతాకాలానికి వేడిటీ ఉండాలి. చక్కని సినిమా మందిరాలు ఉండి వారాని కొకఫిల్ము మారుతూ ఉంటే మానసానందంగా ఉంటుంది. ఏదైనా గుర్రపుపందెంలో కోరినంత ద్రవ్యం దివ్యంగా లభిస్తూ ఉండాలి. పైకం దాచుకొనుటకు బ్యాంకు లుండాలి. భీమా కంపెనీలుండాలి. ఇన్ని సౌకర్యాలు ఉంటే అది సుఖమైన సుకరమైన జీవితం. ఇన్ని జీవిత సౌకర్యాలను కల్పించే టటువంటి లక్ష్మి కటాక్షంకోసం ఆపాలకడలి చెలియ చెలిమి కలిమికోసం, సముద్రంలో యీదినట్లుగా యీతకొట్టి తలమున్కలవుతూ యీ భూతల వాసులు నేలవిడిచి సాము చేస్తున్నారు. మనకు పరిపూర్ణమైన సౌఖ్యమును ఆనందమును యిచ్చేటటువంటి లక్ష్మి మనకు దూరంగా ఎక్కడో నడిసముద్రంలో ఉన్నదని భావించడం కేవలం భ్రమించడం - పరిభ్రమించడం - దుర్భ్రమించడం.

త్యాగరాజులవారికన్నా ఆనందం అనుభవించినవాడు ఆంధ్రదేశంలో ఉన్నాడా? రామ బ్రహ్మానంద రసము పానము చేయ గల్గిన మహానుభావుడు. "దారసుతులూ, ధన ధాన్యములుండిన—శాంతము లేక సౌఖ్యమూ లేదు - సారసదళ నయనా" అనే కృతి ఆయన అనుభవించిన ఆనందమునకు మూలకందమును వివరించింది. బాహ్య ప్రపంచ వ్యాపార సాగర తరంగములలో గాక అంతరంగములోనే ఆయనకు మోక్షలక్ష్మి సాక్షాత్కరించింది. ఆయన మన అందరికంటె, ఎక్కువ జీవితసౌఖ్యం అనుభవించాడు. ఆయనకు బ్యాంకుతాయిలు లేవు—జీవితభీమాలు లేవు. కాని మనకంటె ఎంతో వింతగా నిశ్చింతగా జీవితమును జగజ్జేగీయమానంగా గడిపి, "నిధి చాలా సుఖమా? రాముని సన్నిధి సుఖమా? నిజముగ దెలుపుము మనసా!" అని ఆయన తన మనస్సునే గాక, మనల నందరినీ ప్రశ్నించాడు. త్యాగబ్రహ్మగారి అంతరాత్మ పరిపక్వమైనంతగా మన అంతరాత్మ స్వరరాగసుధా మాధుర్యధుర్యంబు కాకపోవచ్చు— ప్రతి విద్యార్థియున్ను ఫస్టుక్లాసులో ప్యాసు కాకపోవచ్చు. పట్టపరీక్షలో ప్రప్రథముడుగా ప్రవీణుడు కాకపోవచ్చు. కాని, అంతమాత్రంచేత విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేయడం, పట్టపరీక్షకు చదవడం గిట్టుబాటులేని వ్యర్థవిరక్త ప్రయాస ఏ విద్యార్థికీ కాదు. సాధకం వల్ల బాధకం లేదు. బాహ్యజీవిత భోగ సౌకర్యావకాశములు యోగులకు భవబంధ పాశములు - వారుకోరేది మోక్షలక్ష్మి. ఆ లక్ష్మిని వారు తమ అంతరంగంలోని ఆత్మతేజస్సునందే సందర్శించి అమందానందం పొందుతారు. ఆ విధంగా ఆత్మశ్రీని ఆరాధించ గల్గినవారే, "సుకృతాత్ములు, రససిద్ధులు" -...."అద్వీయాధిక కీర్తిశరీరంబులు ప్రకట జరామరణ జన్మ భయ రహితంబుల్." అటువంటివారి కీర్తిశరీరములు ముసలితనమువల్లనూ, మరణమువల్లనూ పుట్టిన భయములేనటువంటివి - వారి కీర్తిశరీరములనే కాదు, వారి భౌతిక శరీరములను కూడా ముసలితనమనేది బాధించదు. అటువంటి రససిద్ధులు శతవృద్ధులైనా వారి ముఖంమీద ముడుతలు కన్పించవు. ఆ మహాత్ముల ముఖారవిందములు "శాంతరసమొల్కు బ్రహ్మతేజంబుతో" ప్రకాశిస్తూఉంటాయి. కారణం ఏమిటంటే, యీ శరీరం ముసలి


# కథాసాగరం
నెలకో పుస్తకం

ఈ నెల మాలతీ చందూర్ కథలు వెలువడినయి.

120 పేజీలు 1 రూపాయి

దేశి కవితామండలి, విజయవాడ-2.

దయిపోతుందేమో అనే భయం పీడిస్తున్న కొద్దీ, ఆ భయంతోనే ఆవ్యాకులంతోనే శరీరం విశీర్ణమవుతూ ఉంటుంది అవయవముల పట్టు తగ్గిపోతూ ఉంటుంది కుక్క కరుస్తుందేమో అని మనము పరుగెత్తినకొద్దీ ఆకుక్క మనలను ఇంకా యింకా వెంటాడి తరుముతుంది ముసలితనం అనే మొసలి కూడా అంతే

దాహం చేత (సుఖపడవలె ననే తృష్ణచేత) యీ సంసార కాసారంలో అడుగు పెటినఆసామీ ఎంతటిఆస్తిపరుడైనా, హస్తిరాజైనా ముసలిమొసలినోట జిక్కి ఓడి వాని ముఖమువాడి ముడుతలుపడక మానదు బమ్మెర పోతరాజు అంటే హరిభక్తిలో హస్తిరాజు తన భాగవతమును "నరాధముల కిచ్చి సొమ్ములు వాహనంబులుఁ" గైకొనుటకు ఆయన సమ్మతించలేదు "సమ్మతి శ్రీ హరికిచ్చి జెప్పె నా బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్"-ఆయనకు తృష లేదు "కష్టపడుతున్నాను ముష్టి పెట్టండి" అని యాచించలేదు ఏ రాచవారి నైనా

కాని శ్రీనాథుడు "కలియుగంబున రికమండ గష్టమనుచు యరుగుచున్నాడు శ్రీనాథుడమర పురికి" అని అవసాన దశలో ఆక్రోశించాడు శ్రీనాథుడు కోరిన "శ్రీ' ఆయనకు ఆఖరుకు "కష్టశ్రీ"ని లభింపజేసింది ఆయన ఆరాధించిన శ్రీ ఆయన ఆశ్రయించిన అధిపతులకంటె అధిక చంచలమైనది కాని బమ్మెర పోతరాజు ఆరాధించిన ఆత్మసంద్శ్రీ అచంచలమైనది "శ్రీ కైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్" అన్నాడు ఆయన ఉపాసనచేసిన "శ్రీ" అది కాని, శ్రీసాధుని "శ్రీ" అది కాదు బంగారు గిన్నెలలో భోజనం చేశాడు రాజుల ముత్యాలశాలలందు కనకాభిషేకాలు పొంది, మిన్నందిన ఆనందముతో అందలమెక్కినాడు ఆయన జీవితసౌఖ్యం ఈవిధంగా సౌధం ఎక్కింది. ఆ సౌధంమీదనుంచి క్రిందికి దిగుటకు శ్రీనాధుని మనుస్సు ఒప్పుకోలేదు క్రిందకిదిగడం గినదిన గండం అయింది అందువల్లనే "తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుడన్" అని అడగడం సంభవించింది కన్నడరాజ్యలక్ష్మిని నమ్మితే అంతే శ్రీనాథుణ్ణి కన్నుగీటి కటాక్షించి మోహింపజేసిన "శ్రీ" ఆఖరుకు ఆయనను ఉపేక్షచేసి, చుల్కనచేసి కన్నడచేసింది కన్నడ రాజ్యలక్ష్మి కన్నడచేయక మానదు అనేమాట పోతరాజు ముందుగా నే గ్రహించాడు. ఆ లక్ష్మి మనలను విడిచినా, ఆ లక్ష్మిని మనము విడిచిపెట్టలేని మోహం మనకు మిగులుతుంది అదే తృష్ణ - చింత వచ్చినా పులుపుచావదు-ఆ తృష్ణ ఉన్నంత సేపూ "కృష్ణా!" అని స్మరించినప్పటికీ, తన దాహం తీర్చే ప్రవాహమే కృష్ణ యని భావించి ప్రార్థిస్తారు

డెబ్బదిఏండ్ల ముసలివాడు శంకరం - అయితేనేం? రబ్బరు బంతివంటి మనిషి, - అయిదు యకరాల ఆస్తికోసం ఏడువిళ్లు మూడు కోర్టులూ తిరిగి మూడుచెరువుల నీరు త్రాగించాడు ప్రతివాదులను ఆ దావాల కోసం అయిన ఖర్చుతో అతని తైలం హరించి దీపం ఆరిపోయింది

దావా ఆస్తికి చాలా అప్పుఅయింది సుక్షేత్రమైన డెబ్బై దామూలు యీనాం పల్లపుభూమి భుక్తమైంది అయితేనేం? ఆ పల్లపుభూమికి పూడ్చలేనంత గొయ్యి అన్నట్లుగా తీర్చలేనంత అప్పు ఏర్పడింది ఆ పల్లపుభూమి మరింత పల్లమై అగాధమైంది అంత పట్టుదలతో వ్యాజ్యమాడిన ఆసామీ వ్యాజ్యం గెల్చినతర్వాత మంచము పట్టి మనోవ్యాకులంతో జీర్ణించిపోయినాడు ఒకనాటి ఉదయం డాక్టరులు వచ్చి చూచారు చేతికి నాడి అందడంలేదు. కొడుకులకు కబురుచేశారు ప్రాణప్రయాణ సమయంలో తులసితీర్థం పోయడానికి పెద్ద కుమారుడైన నరసింహాన్ని పిలిపించారు తండ్రి అవసానదశలో ఉన్నాడనే వార్త చెప్పినప్పటికీ, ఆయన విషయంలో తాను దిగులుపడను అన్నట్లుగా, చెట్టునుంచిపండిన పండు చేతిలో రాలినదన్నట్లుగా, ఉల్లా

(53-వ పేజీ చూడండి)


# జలుబు
## లక్షణాలను గమనించండి

* ముక్కులో మంట
* తరచు తుమ్ములు
* గొంతుఎండి రాచుకొను నట్లుండుట

జలుబుచేసిన మొదటి చిహ్నమునకే మీముక్కు రంధ్రములలో కొంచెం 'కిపాక్' వేయండి ముక్కు సడలి ధారాళముగా ఊపిరాడును శ్వాసంధారాళంగా ఆడటంకంటెవేరేది జలుబు కుదుర్పలేదు దీర్ఘకాలము నిలిచియుండు జలుబులకు రొమ్ముమీద, గొంతుమీద, వెనుకవైపు రాత్రులందు కిపాక్ ను బాగా రుద్దండి

కిపాక్
కిపాక్ పీల్చుటకు - రుద్దుటకు

KIPAK INHALANT RUB COLDS

వెస్ట్ మినిస్టర్ లేబరేటరీస్ లిమిటెడ్, లండన్ వారి తయారీ

ఏజెంట్లు ఓరియంటల్ మర్కంటైల్ ఏజెన్సీ,
99 - ఎ - ఆర్మీనియన్ వీధి, మద్రాసు

# ఇంతేవో ఉంది

ఉదయం, పదిగంటల పదిహేను నిమిషాలు—

వెంకట్రావు ఇంట్లో అడుగుపెట్టేసరికి అమ్మాజీ, సూరిగాడు పోట్లాడుకుంటున్నారు ఏడుపుకూడా కొంచెం వినిపించింది అసలు వెంకట్రావు ఇంట్లో అడుగుపెడుతూ తను నరకానికి వస్తున్నట్లు ఎప్పుడూ అనుకోడు అంతకన్న అది స్వర్గమనీ ఎప్పుడూ భావించడు. ఎందుకల్లో ఈ రోజున కొంచెం చిరాకుతో నే గుమ్మంలో అడుగుపెట్టాడు చొక్కా విప్పుకుంటుంటే సూరిగాడు, అమ్మాజీల గొంతుకలు మరికొంచెం స్పష్టంగా వినిపించాయి "ఎప్పుడూ తన్నుకోవడం, గుద్దుకోవడం - వెగవలు తిని పడివుండక" అని చీదరించుకున్నాడు వాళ్ళ గొడవలో తను కలగచేసికొని తీర్పు, ఇవ్వదల్చలేదు కాని తిరిగి తిరిగి ఇంటకొచ్చేసరికి ఇట్లాంటి గోల! ఎట్లా పట్టంచుకోకుండా ఉండడం? అతను బనీను విప్పుకుంటున్నాడు అతను రావడం ఎనిపించి అమ్మాజీ సూరిగాడు గబగబా పరుగెత్తుకొని ముంగుకొచ్చి—

"నాన్నా! చూశావా అమ్మాజీ నన్నెలా రక్కిందో!"

"కాదు నాన్నా! నా సంచీయేమో!" అని ఏగపు మొహాలతో వెంకట్రావుకు ఫిర్యాదు చేశారు. తను సంగతేదో తేల్చమనే వాళ్ళ ఫిర్యాదుకు అర్థం ఆ పోట్లాట ఎందుకోసమో పూర్తిగా వినకుండానే అతనికి తెలిసిపోయింది

వెంకట్రావు ముఖంలో కోపం అమాంతం కొట్టవచ్చినట్లు కనపడడంతో మొదట కొంచెం భయపడ్డా, విధిగా తీర్పు జరిగి తీరుతుందని వాళ్ళిద్దరి ఆశ సూరిగాడు 'రక్కుమాట' గట్టిగా జ్ఞాపకం పెట్టుకొన్నాడు విచారణలో దానిని గురించే బాగా విశదీకరించ దల్చుకున్నాడు సంచీ మాట ఏమైనా, అమ్మాజీ సూరిగాడిని రక్కడం ఘోరంగా కనిపించింది వెంకట్రావుకి

"ఎందుకే అమ్మాజీ వాణ్ణి అలా రక్కిపోశావు?" హుంకరించాడు వెంకట్రావు ఇదే మంచి అదను అనుకొని సూరిగాడు కొద్దిగా రక్తం చెమర్చుతున్న వీపు చూపాడు, వెంకట్రావును చూడమన్నట్లు

"కాదు నాన్నా! ముందు నన్ను గిల్లి నా చేతిలో సంచి "

"అదికాదు నే నడిగేది అసలు వాణ్ణి ఎందుకు రక్కావూ అంట"

"కాదు నాన్నా . "ఇంకా ఏదో చెప్పబోతూంది అమ్మాజీ.

"కాదూ లేదు; గీదూ లేదు భడవా. అసలు వాణ్ణెందుకు రక్కావంటే మాట్లాడవేం" అని రెట్టించాడు వెంకట్రావు, సమాధానంకోసం చూస్తూ

తండ్రి మాటల్లో ఏం భయం కనిపించిందో, తనమీద విరుచుక పడబోయే ఏం ప్రమాదం తోచిందో, అమ్మాజీ కిక్కురుమనలేదు తనని సమర్థించుకోడానికి గల ఆయుధాన్ని కూడ వెంకట్రావు లాక్కోవడంతో, అమ్మాజస్థితి నిస్సహాయమైంది జరిగిన సంగతి వివరంగా తను చెబుతుంటే వినడేం నాన్న? ఎలాగ? తను సూరిగాణ్ణి ఎందుకు రక్కిందో ముందు నాన్నకి జవాబివ్వాలిట! "అసలు జరిగిందిద" అని స్పష్టంగా మొదటినుంచీ చెబితే న్యాయ

[illegible]

మేదో నాన్నకే తెలుస్తుందని దాని నమ్మకం తను వాణి ఎందుకు రక్కిందో అమ్మాజీ ఒక్కమాటలో చెప్పలేదు తనని వాడు అలా చెయ్యడంవల్లే తను రక్కానని, లేకపోతే రక్కేదాన్ని కాదని, నాన్నకి తెలియచెయ్యాలని అమ్మాజి వుద్దేశం

"ఏం మాట్లాడవేమే? ఎందుకు రక్కావు" నిలదీశాడు వెంకట్రావు అమ్మాజీ ఏమ్మనదు ఆ ప్రమాదంనుంచి తప్పించుకోవడమెలాగ అని ఆలోచిస్తోందేమో ఎందుకు రక్కావు అనే ప్రశ్నకు కదా తను కారణం చెప్పాలి! మరి కారణం చెబుతుంటే నాన్న తనని ఎందుకు మాట్లాడనివ్వడో, దానికి ఏమి అర్థమైచస్తుంది! అసలు నాన్న ఉద్దేశం అది కాదనీ, సూరిగాడిని రక్కడం తప్పు అవునో, కాదో ఒప్పుకోవడమే నాన్న ప్రశ్నకి అర్థమనీ - దానికి తక్షణం ఎలా స్ఫురిస్తుంది? ఎందుకు రక్కిందో కారణం చెప్పకుండా ఎలా? అమ్మాజీ భయంతో వెంకట్రావుకేసి చూస్తూంది

"అదీ! అలాగ అడగాలి - మాబాగా అడిగాడు నాన్న" అని సూరిగాడు ఆనందించి రక్కుబాధ మరచిపోయాడు

తనే సెగ్గాననే ధీమాతో వాడి కళ్ళు మెరిశాయి వెంకట్రావు అమ్మాజీని నిలదీసే చూపుల్లో వాడూ చూపు కలిపాడు

"నిన్నే! చెప్పూ! వీపు చీల్చుతుంది చూస్కో చెప్పకపోతే - రక్కావా? లేదా?"

వాడిని ఉత్తినే తను రక్కానని ఒప్పుకొనే స్థితిలో లేదు అమ్మాజీ తనని గిల్లి సంచీ లాక్కున్నాడు గనకే తను రక్కానని చెప్పగల్దు అమ్మాజీ అయితే "వీపు చీల్చుతుంది చూస్కో" అనే మాటతో అది కొంచెం వణికి బితుకు బితుగ్గా చూస్తూండగానే "మాట్లాడవేం? అసలు మిమ్మల్నిద్దరినీ ఒకచోట ఏడవద్దని చెప్పానా లేదా!" అనడం, అంతలో కొడతా డనుకొని దెబ్బలు రెండు మూడు అమ్మాజీవీపుమీద పడడం ఏకకాలంలోనే జరిగాయి ఎప్పుడెప్పుడా అని అమ్మాజీ నెత్తిమీద ఆయత్తం అవుతున్న నీళ్ళకుండ భళ్ళుమని బద్దలైంది ఏగుపు ఎక్కుగా సూరి "రక్కాను నా సంచీ నన్న - వాగుగిల్లాడు" అని పూర్తిచేసె దీర్ఘంతీయనారంభించింది

"మరి ముంగిలా మాట్లాడవేం" అని కసిగా పళ్లు బిగించిన వెంకట్రావు కొండా మనసు నే మళ్ళీ ఎందుకో ఎత్తిన చేతిని అటానే వుంచి 'క్లయిమేక్స్'లో వున్న తన కోపానికి మరోదారి దొరకులేక, పక్కనే సగర్వంగా అమ్మాజి దెబ్బలు తింటూంటే బాగా జరిగిందని ఆనందించే సూరిగాడి వేపు తిరిగి, ఒకసారి ఒక్క రిమారు చిక్కు మొహం వేశాడు సూరిగాడు ఇంత హఠాత్తుగా సూరిగాడివేపు వెంకట్రావు దృష్టి పడుతుందని ఎవరు అనుకుంటారు? వాడికి పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి

"ఏరా! వెధవా! మిమ్మల్నిద్దర్నీ ఒకేచోట ఆడద్దని చెప్పానా లేదా" అని ఎత్తిన చేతిని దించి వెంకట్రావు సూరిగాడి చెంపఛెళ్ళుమన్పాడు గటగా వాడు సరిగా దెబ్బపడకుండానే ఏదో కొంప మునిగిపోయినట్లు పెద్దగా ఏడవ నారంభించాడు ఏదో కారణంతో సూరిగాణ్ణి ఆ క్షణంలో కొట్టవల్సిన వెంకట్రావుకు గప్పున ఏదో జ్ఞాపకం స్ఫురించింది - "అమ్మాజికి అసలు చదువుపృష్టే లేదు ఇక సూరిగాడు చదువుతున్నట్టు నటిస్తూ అడ్డగాడిదలా తిరుగుతాడు వాడికి హాఫియర్లీలో లెక్కల్లో పది మార్కులొచ్చాయి" "ఎప్పుడైనా!

చదివినపాఠాన పోయావూ? అస్తమానూ అమ్మాజీతో పోట్లాటే!" అడిగాడు చెవి మీద చెయ్యితీసి.

వాడు ఏడుపు దిగమింగుకుంటూ "టెస్ట్ వర్కు చేశాను. ఇంగ్లీషుపద్యం వచ్చేసింది" అన్నాడు.

"ఇంకేం చదవడానికి లేవూ?" వెంకట్రావు ఓ పట్టాన వాడిని వదలదల్చుకోలేదు.

"అన్నీ వచ్చేశాయి" అన్నాడు సమాధానంగా వాడు.

"వెధవా! లెక్కలు సున్న చుట్టింది కదా. ఒక్కసారైనా చేసి ఏడుస్తున్నావూ. పోయిచెయ్యి లెక్కలు" అని ఛెళ్లిన వాడిని రెండుకొట్టి తన కోపశేషాన్ని తీర్చుకున్నాడు వెంకట్రావు.

అప్పటికి పదిగంటల ఇరవై నిమిషాలు దాటింది.

పాపం! సూరిగాడిని కొట్టేబదులు వెంకట్రావు వాడిని దగ్గర కూర్చోబెట్టుకొని రాని వేవో చెప్పగూడదూ? అబ్బే! అతను ఆ పనిమాత్రం చేయలేడు. పైగా వీళ్ళతోనూ వాళ్ళతోనూ గొప్పగా "మా అమ్మాజీ సూరిగాడూ, వాళ్ళ కెంతతోస్తే అంతేగాని ఎవళ్ళనీ లెక్కచేయరండోయి. రావణా వెధవలు" అని వెంకట్రావు చెప్పుకుంటుంటాడు. సూరిగాడు సెకండ్ ఫారం, అమ్మాజీ నాలుగోక్లాసు. ఇద్దరికీ ఒక్క నిమిషం పడదు. అయితే వాళ్ళు ఎప్పుడూ దూరదూరంగా వుండరు. మళ్ళీ కలిసే ఆడుకుంటూ పోట్లాడుకుంటారు. పెద్దవాళ్ళని ఎదిరించడం, వాళ్ళలో వాళ్ళు కొట్టుకోవడం తప్పితే ఇద్దరికీ చదువు సంధ్యలు లేవు.

వెంకట్రావుభార్య వంటింట్లోంచి గదిలోకి వచ్చి జరిగిన గందరగోళం వినడం చేత—

"ఆ సూరి వెధవకి మరీ చదువుసంగతి పట్టకుండా వుంది. వాళ్ళ గొడవే మీకు అక్కరలేకుండా పోయింది – చదువుతున్నారో లేదో మానీ ఒక్కసారీ వాళ్లని చదవమనరు. ఎందుకూ – చదవనప్పుడు? వాడికి స్కూలుజీతం దండగ – గట్టిగా కోపం వస్తే ఒంటినిండా తేలేట్లు కొట్టడమే కాని చదువు గొడవే అక్కరలేదాయె మీకు – నానాట అంటే అసలే లెక్కలేదు వాళ్ళకి. గడ్డిపరకా నేనూ సమానం. లోకువ ఇచ్చుకొనేదీ మీరే, బాధపడేదీ మీరే. నాకేం" అని అనదల్చుకున్నవి నాలుగూ అనేసి, వచ్చినపని పూర్తయిన దానిలా చకచకా వంటింట్లోకి వెళ్ళిపోయింది.



"కామాలేదు; గీతా లేదు. భడవా! అసలు వాణ్ణెందుకు కొట్టానంటూ మాట్లాడవేం?" అని రెట్టించాడు వెంకట్రావు సమాధానంకోసం చూస్తూ.

వెంకట్రావు భార్య ఉపన్యాసం ప్రత్యేకం శ్రద్ధపెట్టి వినకపోయినా దగ్గరగా వచ్చి గట్టిగా అన్నప్పుడుకూడా ఎట్లా వినబడకుండా వుంటుంది? భార్య ఎన్ని అనుకుంటేం! అతనికేం లెక్క. భార్య మాటలు విని చెడిపోయేంతటి బుద్ధిహీనుడా వెంకట్రావు? కాదు.

అసలు వెంకట్రావు చేసిన గొప్ప పొరపాటు ఏమిటంటే కుర్రాళ్ళిద్దరికీ తలో సంచీ కుట్టించకపోవడమే. నిజానికి ఆ విషయంలో అతన్ని దుయ్యబట్టవలసిన అవసరమూ కనపడదు, ఎందుచేతనంటే సంవత్సరం క్రితం సంచీకోసం ఇద్దరూ గొడవపడుతున్నారంటే రెండు సంచీలు కుట్టించాడు. ఒకటి చాకలిది పారేసి తన కసలు వెయ్యనే లేదని బుకాయించింది. రెండోది కుర్రాళ్ళు ఎవళ్ళకో ఇస్తే అది మళ్ళీ ఆ ఇంటిముఖం చూడలేదు. అప్పట్లో వెంకట్రావు సంచీ ఎవ్వరికీ ఇవ్వద్దని హెచ్చరిక చేయనే చేశాడు. కాని ఆ ఇంట్లో అతని మాట అమలు జరిపే దెవరు? తరవాత తన అవసరానికి వెంకట్రావు సంచీ కుట్టించుకుంటే దానికోసం ఇద్దరూ తగూలాడుకుంటున్నారు. ఇద్దరినీ స్కూలుకి సంచీ

# ఇంతలో ఉంది

పటికెళ్ళదు అని అతను గట్టిగా చెప్పినా ఎవళ్ళకీ అకినప్పుడు వాళ్ళు అతనికి లేకుండా తీసకొని పోతూనేవుంటారు అయితే వెంకట్రావుకి కోపం వస్తే వరసా వావీ లేకుండా తిట్టడం, తగిలే చోటు తప్పేచోటు చూడకుండా ఒళ్ళు హూనం అయేట్లు చచ్చేలా బాదడం తప్పితే, ఆ ఉత్తరక్షణంలో అతని మాటకేమీ విలువేలేదని చెప్పాల్సి వస్తుంది వెంకట్రావుది వట్టి వెఱ్ఱికోపమనీ సమయం సందర్భం తెలియని మనిషి అనీ అంటారే గాని, ఆ ఇంట్లో ఎవరూ అతను చెప్పిన పనిని ఒక్కళ్ళూ అక్షరాలా చేయరని గాని ఎవరికీ అతని మాట లెక్కలేదనిగాని ఎవ్వరూ గుర్తించరు

కుర్రాళ్ళు ఏంకావాలంటే అన్నీ వెంకట్రావు జరుపుతాడు వాళ్ళు కావాలన్న దానికన్నా పదిరెట్లు ఎక్కువ తెచ్చి పడేస్తాడు తను చెప్పినట్లు వాళ్ళు చేస్తున్నారో లేదో చూసకొని వాళ్ళు కోరినదల్లా ఇవ్వడమూ మానడమూ అనేది ఆలోచించడు కోపంవస్తే ఎంత ఒళ్లూపై తెలియకుండా కొడతడో,మామూలుగా వాళ్లంటే అంత ఎక్కువ ముదు అతనికి అతనికి తీరిక వుంటే ఇంట్లో కాలు నిలవదు వీళ్ళింటికో గాళ్ళింటికో కబుర్లు చెప్పడానికని బయలుదేరతాడు గాని కుర్రాళ్ళకి ఒక్కముక్క చెప్పడు చిత్రమేమిటంటే ఆ సమయం వచ్చినప్పుడు తప్పితే అసలు వాళ్ళు చదువుతున్నారో ఏం అఘోరిస్తున్నారో కూడ అతను కనుక్కోడు వెంకట్రావు పిల్లల చదువు విషయంలోనూ, అతను తన ఆరోగ్యం ఎలావున్నదో చూసికోకుండా కనిపించినదల్లా తినడం విషయంలోనూ భార్య అతన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తుంది అతనుమాత్రం ఆ ఇంట్లో మిగిలిన వాళ్ళకేం తీసిపోయాడు? ఎందుకు వింటాడు?

“సూరిగాడికి అంత ఖరీదైన గుడ్డలుకూడా ఎందుకు చదవకుండా తిరిగేవాడికి అలాంటివన్నీకూడా దేనికి? అంతా గోకి వీళ్ళ మొహాన పెట్టడమే గాని తర్వాత ఒక్కళ్లూ మూడరు పెదాడిని చదువదు అని ఎంత మొత్తుకున్నా విన్నారూ అయిందేదో చాలక వాత్తేరు పంపారు చదువుకి వాడు ఎందునా పొందకుండా తయారై బీడీలు సిగరెట్లు స్వేచ్ఛగా కాలుస్తున్నాడు నాది ఉన్న కాస్త భూమికూడా అమ్మేవరకూ మీకు నిద్రపటేంది కాదు’ - ఇంకా ఎక్కో లక్షు చదువుతుంది భార్య అతని వంట్లో ఓపిక వున్నట్లయితే ఆవిడని కొట్టినంత పని చేస్తాడు లేకపోతే తనం గానటు, అసలు తనకు ఆవిడ లెక్కేలేనట్లు తిరుగుతాడు

గదిగోనే నీరసంగా ఇటూ అటూ తిరుగుతున్న వెంకట్రావుకి $12\frac{1}{2}$ బస్సుకి తను ఊరి కెళ్ళాల్సిన విషయం జ్ఞాపకంవచ్చి కాళ్లు కడుక్కునేందుకని దొడ్లోకి నడిచాడు దెబ్బలుతిన్న అమ్మాజి సూరిగాడు పుస్తకాలు ఎక్కడున్నాయో వెతక నారంభించారు సాయంత్రమైనా కూడ వాళ్ళ కపుస్తకాలు కనిపించవు పెట్టిన చోటేదో జ్ఞాపకంవుండి అఘోరిస్తేకదా!

వెంకట్రావు దొడ్లో కాళ్ళు కడుక్కుంటూన్న వాడు మందార చెట్టుదగర ఇంకా అంటుగిన్నెలు కొన్ని ముందేసుకుని తగరపు గిన్నె తోముతున్న అత్తగారిని తదేకంగా రెండు నిమిషాలు శ్రద్ధపట్టి చూశాడు అతనికి ఒళ్లు మండుకొచ్చింది అతని అలికిడి విని ముసలమ్మ గబగబా తోముతోంది తగరపు గిన్నె

“మరేం తొందర లేదండోయ్ అత్తే బైమవలేదు పదకొండే అవుతి ఎప్పటికైతే అప్పుడే తిందాం మరేం శ్రమపడకండి’ ఘర్రుమన్నాడు వ్యంగ్యార స్ఫురణతో వెంకట్రావు

ముసలమ్మ ఏదో వంకపెటుకొని దాసీ మనిషి తోమిన అంటుగిన్నెలు మళ్ళీ రెండు గంటలసేపు చేతులు అరిగేలా తోముతుంది తుడిచినచోటే పదిసార్లు తుడుస్తుంది అదంతా శుభ్రంకోసమని అంటుంది ముసలమ్మ అది శుభ్రంకాదు, చేదస్తం, ఆచారం అంటారు వాళ్ళు ఆవిడ వంట చేస్తే ఎప్పుడూ ఒంటిగంటే భోజనం అయి ఆవిడ లేచేసరికి మూడుగంట లవుతుంది

(54-వ పేజీ చూడండి)

దుకాణదారుడితో ఒకావిడ “ఇదేమిటయ్యా, రెండువీసెల పంచదార తెమ్మని మాఅబ్బాయిని పంపిస్తే ఒకటిన్నరవీసెలే ఇచ్చి పంపించావు?”

దుకాణదారుడు “నేను తూచడం రెండువీసెలూతూచే పంపించాను ఇంటికి వచ్చిన తరవాత మీ అబ్బాయిని తూచి చూసుకోకపోయారా?”





కేశవర్ధని అ 14; షాంపూ అ 14, అందరు డీలర్లవద్ద లభిస్తాయి
లేక సౌత్ ఇండియా కెమికల్స్ కాన్ కట్ రోడ్డు కోయంబత్తూరుకు వ్రాయండి

# నిర్జీవి గమనం

వెళ్లొస్తానని వెంకట్రావుతో రామం చెప్తాడు కాని మొహాన్ని నెత్తురు చుక్క ఉండదు.

పోనీ కష్టంగా ఉన్నప్పుడు మానేయకూడదూ? యెందుకు బెంగ? అంటాడు వెంకట్రావు. గడియారం గంట కొడుతుంది. తలయెత్తి చూస్తాడు రామం. ఏడుగంటలు. యీ విశ్వంలో ప్రతివస్తువూ తనపని ముగిసేదాకా అసలు విరామం యెందుకుండాలి?

దిగులుగా తలవాల్చి శూన్యదృక్కులతో సమాధానం చెప్పి మెట్లుదిగుతాడు రామం.

తన యింటికీ ఆఫీసుకు రెండుమైళ్లు దూరముంటుంది. ఆ దూరాన్ని బహుశా రామం ఆలోచించడు. ఆలోచిస్తే అసలు ఆ దూరం తరగదేమో కూడా. వచ్చినబుర్ర యెత్తకుండా నడుస్తూ పోతే తనమార్గం తాను జాగ్రత్తగా అవగాహిస్తున్నాడనుకుంటారేమో! అసలు కారణం వేరు. తన బుర్ర మీద యేదో బరువుఉంది. ఆబరువుతో తన శిరస్సు క్రుంగుతోంది. యెన్నెన్నో ఆలోచనలు పరుగెడతాయతని బుర్రలో. ఇన్ని ఆలోచనలకు ఆటపట్టయిన తన మెదడు ఒకప్పుడు యెందుకు యింకిపోతుందో యెవరికి తెలుసు? తన శరీరం తనకు బరువైనటు మోసుకెళ్తాడు. నిజానికి చుట్టూ ఉన్న ప్రతీవస్తువూ తన బరువంతా అతనమీద మోపుతున్నట్టనిపిస్తుంది. ఆఖరికి తనకు తానే బరువు అవుతాడు. అయితే యీ భారం అంతా యెవరికోసం అతను మోస్తున్నాడో! ఈ శృంఖలాలను తెంచుకు విహరించాలని నిజానికి ప్రయత్నిస్తున్నాడేమో! తనకు తానే ఊహించుకోలేని అవస్థ. ఒక్కమారు తన గమనం మందగిస్తుంది. అప్పుడనుకుంటాడు - తాను నివ్వెరపోయి శరీరాన్ని బలాత్కారంగా వెనక్కు లాగుతాను అప్పుడనుకుంటాడు. తన ప్రాణంతో మెలిపడినజీవాలు యీవిశ్వం నుంచి తాను నిరమించినా తనతోనే వస్తాయి.

ఇలా మరి కొద్ది అడుగులు పడతాయి. తన శరీరంలోంచి దారి చేసుకు దూసుకు పోతున్నట్టు కారు చప్పుడు. ఆనాలుగు రోడ్ల కలయికలో పోలీసు ప్రాణం నాటకుపోయి ఉంటుంది. చేతులు లేస్తూ వాలుతూ దారి చూపిస్తాయి. ఆ దృశ్యం చూస్తే తనకే నగు వేస్తుంది. తన విధిని తాను నిర్వర్తించలేక నివ్వెరపోతున్నాడనిపిస్తుంది.

ఆ పోలీసు మొహం నవ్వుతుంది. జట్కాలో పోయే మనిషిని చూస్తూ అతనికూడా సుఖంఉంది ఆనందంఉంది. తన అవస్థకు తానే కారణం. ఆత్మనిందలో ఒక నిశ్చయం గొంతువేస్తుంది. అతని హృదయంలో భారంలేని బాగిని ఊహిస్తాడేమో! చరచరా అడుగులు పడుతూ ఉంటాయి. గమనవేగం లావు అవుతుంది.

## భాట్టం శ్రీరామమూర్తి

అక్షణంలో తన ఎల్లల్ని తాను ఊహించుకుంటాడు. మిఠాయిపొట్లంయిచ్చి 'అమ్మా తిను అంతా నీకే' అని మళ్ళీ తానుఅన్నట్టు ఊహిస్తూఉంటాడు. 'ఒసేయ్ మన కష్టాలు కాలం చేసేయి. మనం సుఖాన్ని తోడుగుదాం మన జీవితానికి' భార్యతో అంటున్నట్టు పగటికల.

ఇంతలో తిరిగి తలపుల తరంగాలు మారుతవి. హైమై తయింకో ఆతృపడతాడు. "యివాళ ఎసు ఎగుం బావుకు తప్పక రావాలి' అని తన ఆఫీసరు మాటలు. యిది రమారమి ప్రతిదినం ఉండే హెచ్చరికే. అయినా మాట పడవలసివస్తుందని బెంగపడతాడు. ఇంతకీ ఆఫీసువేళ కాకపోయినా ప్రతిదినం తానిట్లా యెందుకు వెళ్ళాలి? నిర్మొహమాటంగా తన ఆఫీసరుని యెందుకు అడగకూడదు? పర్వతాన్ని పెకలించడం సాధ్యం కాదు. పాతుకుపోయిన ఆచారాన్ని యిటు లేదనడం మరీ సాధ్యం కాదు. తాను అందుకు సాగుకోపోవడంలోనే తనమంచితనం ఉందని ఊహిస్తూ ఆ మసకపు దారిని తాను గదిలో ప్రవేశిస్తాడు. కాగితాలపై కలం సాగుతూనే ఉంది. పేగులు ఎందుకు కూస్తాయో! సెలవు యెందుకు కొంత సుందో పోయి భోజనంచేసుకు అరగంటలో రమ్మనేమాట వింటాడు. కుర్చీలో వాస్తుకుపోయిన దేహాన్ని నీరసంగా సాగ ప్రయత్నం చేస్తాడు. ఆగితారు యజమాని ముఖాన్ని చూస్తాడు. అడుగు బయట యింకా పడదు. "మధ్యాహ్నం చాలా పని ఉంది తొందరగా రావాలి" ఆఫీసరు చెప్పింది నిజమే. ఆ పని పూర్తి కావద్దూ మరి తనెప్పుడు పూర్తిచేస్తాడు?

(52 వ పేజీ చూడండి)

హక్స్లీ మింటోజినో

కీళ్లనొప్పులు నడుముపట్లు తుంటినొప్పులు వాతనొప్పులు, నరములనొప్పులు & వ్యాధులు, రొమ్ము పడిశము వలన కలుగు తీవ్ర బాధలను వెంటనే పోగొట్టును

HUXLEY'S MINTOGENO

కెమిస్టు లందరివద్దను, స్టోర్సులలోను, లభించును

ఆంధ్ర రాష్ట్రమునకు సాకిసులు

విజయ మెడికల్ సిండికేట్
విజయనగరం సిటీ



మధుపము

ఫోటో: వి. శంకి, కర్నూలు.

తెల్సును... ఈ సంవత్సరంనించీ ఆమె అనుక్షణమూ అతనిని తెల్సుకుంటూనే ఉంది. ఎవరన్నా సరే, దీనంగా అడుగకపోవడమే లోపం... జేబులో లేకపోవడమే పాపం. అతనైతే లేదనడు... జీతాలు కట్టని కుర్రాళ్ళూ, తీర్థయాత్రలు చేసేవాళ్ళూ, బీదలూ... అందరూ అతని దగ్గరనించి ఉపకారాలు పొందేవాళ్ళే. గట్టిగా ఒక వర్షం పడితే చాలును... ఇళ్లు పోయినవాళ్లు వస్తారు.

ఇత నెవ్వరికీ ఇవ్వనని చెప్పలేడు... ఇవ్వకుండా ఉండలేడు. నెలకి వస్తూన్న రెండున్నర వందలలో ఒక వందైనా దానాలకి పోతూనే ఉంటుంది.

అవన్నీ తెలిసినా శశి, ఇంత జరుగుతుందని ఎప్పుడూ అనుకోలేదు. అడుగక అడుగక తాను అడిగింది; సుందరం నెక్లేసని మాట ఇచ్చాడు. కొంత నమ్మకం అయినా ఉండకుండా ఎలా ఉంటుంది?

"అయితే నెక్లెస్ అబద్ధమన్నమాట!"

దెబ్బతిన్న విషయం ఆమె దాచలేకపోయింది... కాని మరుక్షణమే తేరుకున్నది. స్వార్థపరురాలిగా కనిపించడం ఆమెకిష్టం లేదు.

అతనేమీ జవాబు చెప్పలేదు. బట్టలు వేసుకుని, డబ్బు జేబులో ఉంచుకున్నాడు. చకచక మెట్లు దిగుతున్నాడు.

"వెడుతున్నారా?"

అని అనలేకుండా ఉండలేకపోయింది— అథమం తన నిర్లిప్తత అయినా అతని మనసుని మార్చుతుందని ఆమె అనుకున్నది. ఈ సంవత్సరమూ తాను ఎన్నడూ అతని ఈవిని అడ్డుకోలేదు; సాధ్యమైనంతవరకూ ప్రోత్సహించింది; మనస్సు తిరుగబడినప్పుడు నిశ్శబ్దాన్ని అడ్డం వేసుకున్నది... తాను బట్టలు కొనుక్కోడానికి ఉంచుకున్న రూపాయిలు బడిపిల్లల జీతాలకి అవసరం అయాయి; ఇచ్చింది. తాను గొలుసు బాగు చేయించడానికి తీసుకున్న డబ్బు వర్షానికి కూలిపోయిన ఇళ్ళు నిలవబెట్టడానికి అవసరం అయాయి; ఒదులుకున్నది. చెల్లెలి పుట్టినరోజుకి ఏదైనా పంపుదామని వేరే ఉంచిన మొత్తం ఆయన స్నేహితుడి ఉద్యోగ ప్రయత్నాలకి అవసరం అయింది; సరేనన్నది.

కాని, తన ఒక్క కోరికా, నోరారా ఓసని, తరువాత ఇలా చెయ్యడాన్ని ఆమె సహించలేకపోయింది... ఆమాత్రం అనకుండా ఉండలేకపోయింది.

అతను వెనుకకి వచ్చాడు; ఆగుతాడనుకున్నది. కాని.. అతని ప్రయత్నం అంతా ఆమె నా విషయంలో అంగీకరింప జేయడానికే. ఆమె తన అభిప్రాయాన్ని అన్ని విధాలా దాచుకున్నది. ఆ విషయమై ఆలోచిస్తూన్నట్లే కనపడలేదు. కాని - అతనిని జయించలేకపోయింది. స్నేహితుడి అవసరం కన్న భార్య మనస్సు ముఖ్యమైనదని ఆమె చూపలేకపోయింది.



"ఒక అప్పుని భార్య ప్రాణంకన్న నెక్లెస్ ఎక్కువ విలువైన వంటావా?"
"ఎలా చెప్తానూ? ఎలా చెప్పినా నా మీదికే వస్తుంది"

అందుకనే అతనిని వెళ్లమన్నది... డబ్బు మిగిలినా మంచిదే—దానితో సంతోషంగా ఎవరికైనా ఉపకారం జరిగినా మంచిదే... కాని, రెండూ కాకపోవడం ఎందుకూ?

అతను వెళ్లాడు......

కొద్ది నిముషాలు రిబ్బను అల్లుతూ విప్పుతూ గడిపింది శశి... ఆమె కళ్లు గుమ్మం వైపే ఉన్నాయి. అతను వెనుకకి వస్తాడేమో! ఆశ అంతరాంతరాలలో ఎక్కడో......

ఈ సంవత్సరమూ తన జీవితం ఒక్కసారి కళ్లముందు తిరిగింది శశికి... ఆమె ఎప్పుడూ అన్నిటినీ భరిస్తూనే ఉంది; కళ్ల వెనుకనే భావాలని దాచుకొంటూన్నది. కాని... కాని... దేనికి హద్దు లేదు?

కుర్చీలోనించి నెమ్మదిగా లేచి, టేబిల్ దగ్గరికి వెళ్ళింది... ఉత్తరాలు... దానినిండా. అందులో సగం అతనిచ్చిన, ఇస్తూన్న విరాళాలకి కృతజ్ఞతలే... చికాకుగా వాటిని దొంతిపెట్టి అడుగు అరలో తోసింది.

# రూపాయలూ - అణాలూ

నిముషాలు గడుస్తున్న కొద్దీ ఇన్నాళ్ళూ దాచుకున్న దుఃఖం, అణచుకొన్న ఉద్రేకం పెల్లుబికి రాసాగాయి...ఎందుకని తాను తన కోర్కెలన్నిటినీ అణచిపెట్టుకుని, పరులకోసం బాధపడాలి? అది హృదయవైశాల్యమా? తాను కొత్తచీర కొనుక్కుంటే, నగలు చేయించుకుంటే, తన చెల్లెలికి చిన్న బహుమతి పంపిస్తే, అది సంకుచితదృష్టి ఔతుందా?

శశికి మనసంతా పాడైపోయింది... ఇన్నాళ్ళనించీ ఆమెకి తరుచు మనస్సు పాడౌతూనే ఉన్నది. కాని—ఈరోజు ఎందుకో తన జీవితం అంతా ఎడారివలె అనిపించింది. ఒంటరిగా తిరుగుతోన్నది... ఎందుకని?

ఆ సంగతీ ఆమెకి తెలుసును. దాచి, అణచిఉంచిన ప్రశ్న ఆమె నింక ఎదుర్కొనసాగింది...అతను తనని ప్రేమిస్తున్నాడా? అని. సుందరం ఆమెని ఏమీ అనడు...ఆమెకి పనులు చెప్పడు—ఏ విధంగానూ ఆమెమీద అధికారం సాగించడు. ఒక స్నేహితురాలన్నట్లు సౌమ్యంగా ప్రవర్తిస్తాడు...కాని—అన్ని విషయాలలోనూ స్నేహితురాలితోలాగే ప్రవర్తిస్తాడు...ఆమెదగ్గర బిడియపడుతున్నట్లు, భయపడుతున్నట్లు ఉంటాడు. అతనికి కావలసిందంతా తన దానధర్మాలే.. తన త్యాగమే ... తా నేమనుకుంటూన్నదో, అతను ఆలోచించినట్లు కనపడడు...

రెండేళ్ళక్రిందట అత నెవరో— తా నెవరో...

శశికి ఆ రోజులన్నీ కళ్ళముందు తిరుగసాగాయి...అప్పుడు నాన్నా తనూ ఒక చిన్నయింట్లో ఉంటూ, నాన్న పెన్షన్‌తో కాలం గడుపుకుంటూ ఉండేవారు... ఆ దగ్గిరే సుందరం ఇల్లు. రోజూ అతను కాలేజీకి వెళ్తూంటే తాను చూసి నిట్టూర్పులు విడిచేది - తానూ అలా వెళ్ళి చదువుకోలేనందుకు ... స్కూల్ ఫైనల్‌లో తనకంత మంచిమార్కులు వచ్చినా, సీటుకోసం అప్లై చెయ్యడమే అవసరం లేకపోయింది.

రోజూ - ఉదయమూ, సాయంత్రమూ అతను తన ఇంటిముందునించి నడిచివెళ్తూండేవాడు. తాను తన గదిలోనించి అలాగే చూస్తూఉండేది. కొన్ని నెలలదాకా ఆమె కత నెవరో తెలీనే తెలీదు.

ఆ సాయంత్రం అట్లానే కిటికీదగ్గర నిలబడింది - పిల్లలెవరో ఆడుకుంటున్నారు... తాను కాలేజీ, ఆటలూ తలచుకుంటూన్నది. క్రమంగా పిల్లలగోల దగ్గరికి వొచ్చింది... ఆ గోల మధ్య చీల్చుకుంటూ, ఓ కుక్కపిల్ల అరపు దీనంగా వినపడుతోంది.

తనకేమీ సంబంధం లేనట్లు చూసిందటు—కాని, ఆ పిల్లలు రాళ్ళతో కొడుతూ, చెవి పట్టుకుని ఎత్తి క్రిందపడవేస్తూ, పారిపోతూన్న దాన్ని వెనక్కి తంతూ ఆ కుక్కపిల్లని బాధిస్తూంటే, తాను సహించలేకపోయింది. త్వరగా తలుపు తీసుకునివచ్చి, "ఎందు కలా దాన్ని కొడుతున్నారు?" అన్నది - చికాకుగా.

వాళ్ళు ఆగారు...కాని, ఆ శాంతి అట్టే సేపు నిలచేలా కనపడలేదు - వాళ్ళలో కొంచెం పెద్దవాడు ముందుకొచ్చి, "ఏం, మీదా?" అన్నాడు.

"ఆఁ..." అన్నది తాను.

పిల్లలంతా ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. కుక్కపిల్ల బాధగా, జాలిగా మూలుగుతూనే ఉంది.

"మీదైతే, గుర్తేమిటి?" అన్నాడు వాడు - మళ్ళా.

తాను ఇరుకునపడ్డది-అబద్ధాన్ని ఋజువు చెయ్యడం ఎట్లా? అందులో, అలాంటి అబద్ధాన్ని.

"కుక్కపిల్లలమీద పేర్లు రాసుకోరు!" అన్నది - కోపం చూపుతూనే.

పిల్లలంతా కూడ బలుక్కున్నట్లు పకపకనవ్వారు...తనకి తానా పరిస్థితిలో ఎందుకు చిక్కుకున్నానా అని చికాకు కలిగింది శశికి...అంతగా నవ్వారు వాళ్ళు.

ఓటమిని అంగీకరించి వెనక్కి పోకపోతే, పిల్లలంతా తమ భావి కార్యక్రమానికి సన్నద్ధులౌతూన్నట్లు కనిపించింది శశికి— ఇంట్లో నాన్న కూడా లేడు...ఎలాగా?

"ఏమిట్రా అది?"

ఆయనే—కాలేజీనించి వొచ్చినట్లుంది.. తాను చూడనేలేదు. ఆ గుంపుదగ్గరికి వచ్చి, ఒకణ్ని అడిగాడు.

"చూడన్నయ్యా! కుక్కపిల్ల వాళ్ళదిట!"

ఒక కుర్రాడు తనని చూపిస్తూ అన్నాడు ...తాను సిగ్గుపడ్డది...

"అయితే?"

అతను మళ్ళీ వాడిని అడిగాడు.

"మేం ఆడుకుంటున్నాం...మరేం... ఆవిడొచ్చి..."

"ఊఁ..."

"వాళ్ళ కుక్కపిల్లట ... లాక్కుపోతోంది..."

ఆయన తనవైపు తిరగి, "ఇది మీదండీ?" అన్నాడు.

"కాదండీ...ఊరికె దాన్ని చంపుతోంటే, అడ్డుకుందామని అలా అన్నాను..." తాను అన్నది...

"ఏంరా?...కొట్టావా?.."

"ఛా!...లేదన్నయ్యా..."

వొట్టి అమాయకుడిలా బుంగమూతి పెట్టాడు వాడు—తనకే నవ్వు వొచ్చింది.

అతను హఠాత్తుగా, కుక్కపిల్లని పరీక్షించసాగాడు—తన చేతులనించి తీసుకుని. చినచిన్న దెబ్బలు తగిలాయి... ఎర్రగా, అక్కడా అక్కడా...

అతని ముఖం ఎర్రబడ్డది. పువ్వుమల్లే దాన్ని తీసుకుని, "దొంగ వెధవా!... ఇంటికి పద...నీపని చెప్తాను. దాన్ని ఎందుకురా అలా కొట్టావ్?" అన్నాడు.

ఆ పిల్లలముందు తన మర్యాద కాపాడినందుకూ, వాళ్ళ చేతులనించి ఆ జంతువుని రక్షించినందుకూ మనస్సులో భగవంతుడికి ధన్యవాదాలు చెప్పుకున్నది శశి.

అలా...అలాగ తాము పరిచయులయ్యారు. క్రమంగా ఆయన నాన్నతో చదరంగం ఆడేందుకని రోజూ వొచ్చేవాడు...ఆయనని గురించి అన్నీ తెలుసుకున్నది.

అతను తనని పెళ్ళిచేసుకున్నాడు... కొన్నాళ్ళ తరువాత. ఉద్యోగం వంటనే

---

**ఆయన:** అరే! ఈ కుక్కనెప్పుడు కొన్నారు? మంచి కుక్కేనా?

**ఈయన:** ఆమాట మెల్లిగా అడుగుతారేమండీ?. ఇది పట్టపగలే మా ఇంటికి ఎవర్నీ రానీదు. రాత్రయితే ఇహ మా వీధిలో మనుష్యుల్నెవర్నీ తిరగనివ్వదు. మాకు దొంగల భయమే లేదంటే నమ్మండి!

**ఆయన:** మరి...దీని మెడకొక గొలుసు తగిలించలేకపోయారా...

**ఈయన:** వెండితోటి కొత్త గొలుసు చేయించి వేశామండీ. మొన్ననే ఏ వెధవో దొంగిలించాడు.

— జి. వి. జి. కృష్ణ, మద్రాసు.

దొరికింది - వచ్చేశారు ... నాటినించీ అలా...అలా...

*  *  *

తొమ్మిదది అయేదాకా శశి అలాగే ఆలోచిస్తూన్నది... పైకి పుస్తకంతో కాలక్షేపం చేస్తోన్నట్టు కనిపించినా. గడియారం తొమ్మిది కొట్టడంతో ఒక్కసారి ఈ లోకంలో పడి, ఇంకా ఆయన రాలేదేమా అనుకున్నది. మామూలుగా ఈసరికి భోజనాలుకూడా అయిపోతాయి......ఏనిమిదికే అతను ఇంటికి వచ్చేవాడు.

కొద్ది నిముషాలు ఇటూ అటూ పచారు చేసింది.. బహుశా స్నేహితుడి ఇంటిదగ్గర పనివుండి ఆగారేమో!...కబురైనా పెట్టకూడదూ? ఇంట్లో ఒక్కతెనీ వదిలేసి...

వీధితలుపువేసి, తిరిగి గదిలోకి వచ్చింది శశి...భోజనం చేద్దామని వంటింటి దగ్గరికి వెళ్ళింది. తలుపుతీసి లైటువేసి కంచం ఉంచుకుని, అన్నం పెట్టుకోబోయింది.

ఎందుకో ఒక్కసారి శశికి అన్నం మానేద్దాం అనిపించింది ..మనసంతా పాడైపోయింది. నిమిష నిమిషానికీ తనకి తెలీకుండా ఆ మనిషి నిర్లిప్తత, సాయంత్రం జరిగినదీ, ఆ సంవత్సరంనించీ జరుగుతోన్నదీ ఆమెని చాలా బాధిస్తోంది...

లేచింది - కంచం తీసి...

కాని...ఎందుకు మానెయ్యడం? అనుకున్నది శశి...ఆయన లేకపోతే తనకి అన్నం సయించదు...కదూ?

ఒక్కక్షణం - క్షణంలో సగం..ఔనని అనుకున్నది శశి. ఎప్పుడూ తాను ఒంటరిగా భోజనం చెయ్యలేదు. ఆయన ఏ రాత్రికో శ్రమపడి అలసిపోస్తే తాను హాయిగా భోజనంచేసి కూర్చుంటే ఏం బాగుంటుంది?......

వెళ్ళిపోతోన్నదల్లా గిరుక్కున వెనక్కి తిరిగి కంచం పెట్టుకుని అన్నం పెట్టుకున్నది ... ఎంత తింటేనేం - భోజనం చేశా ననిపించుకున్నది.

ఇల్లు కడిగి బయటికి వచ్చేసరికి తిరిగి, అనిపించింది శశికి...తాను పొరపాటు చేశానా అని...పాపం...అతను బహుశా ఆ స్నేహితుడింట్లో చాలా శ్రమపడి...

గదిలోకి వచ్చింది...రేడియో పెట్టింది.. సినిమారికార్డులు వేస్తున్నాయి. చిన్న శాల్వాం ఉంచి, కుర్చీలో జేరబడ్డది... తాను పొరబాటు చేసిందా?

అతనంత నిర్లిప్తతగా ఉండడం ఎందుకని? దానికిదే మందు... అని సమాధానం చెప్పుకొన్నది...తాను ఉపవాసం చేసినా, భోజనంచేసి ఎదురుచూసినా, భోజనంచేసి నిద్రపోయినా, అతని కొకటే—అందులో ఎక్కడా పరోపకారం లేదుకనుక. ఆమాత్రం దానికి తాను ఎందుకు బాధపడాలి?

ఎన్నో రోజులక్రిందట శశి తాను జీవితంలో చాలా సుఖించగల ననుకొన్నది... అందరిలాగా కాక తన జీవితం బంగారు బాటలలో పయనిస్తుందనుకొన్నది...కాని జ్ఞానం వచ్చేసరికి తాను కంటూన్న కలలు కూడా నిద్రావస్థలోనేనని తెలియవచ్చిందామెకి...తరువాత అవన్నీ కలలేనని ఇలాగ—తెలిసివచ్చాయి శశికి... సుందరం తనని అడిగినప్పుడు తానేమీ ఆలోచించకుండానే నాన్నని అడుగమన్నది ... సుందరం ఆయనని శశికోసం అడిగినప్పుడు ఆయన శశి నేమీ అడుగకుండానే మాటయిచ్చి శశిని ఇచ్చి పెళ్లి చేశాడు. అయితే, ఇదంతా ఎందుకు జరుగుతోందో శశి కష్టపడి ఎప్పుడూ ఆలోచించలేదు. ఆమె కొక నమ్మిక ఉంది—తాను సుఖపడతానని. సుందరాన్ని చూస్తే అలా

తెల్లగా ఉతుకబడినవి
ప్రకాశవంతముగా ఉతుకబడినవి
ఇందుకు సన్‌లైట్ సబ్బే కారణము
బాదకుండగనే బట్టలను తెల్లగాను, ప్రకాశవంత ముగాను ఉతుకును!
SUNLIGHT SOAP
S. 206-50 TL

# ★ రూపాయిలూ - అణాలూ ★

అనిపించేది. అందుకే తాను ఏ ఉద్దేశాలూ లేకుండానే అలా ఊరుకున్నది.

పెళ్ళి అయాక సుందరం మనస్సులో పూర్తిస్థానం సంపాదించాలనే ప్రయత్నం తాను క్రొత్తగా చేయాల్సిఉందని త్వరలోనే తెలిసివొచ్చింది శశికి..అతను ఉద్రేకంగా మాట్లాడితే, అది ఎవరి బాధలని గురించో...అంతే. అతను బాధపడితే— అది ఎవరి అవసరాలనీ కష్టాలనీ తలుచుకునో- అంతే.

ఈ సంవత్సరంలోనూ శశి రెండుసార్లు మాత్రం సినిమాకి వెళ్ళింది—అతనితో. అదేనా, నోరువిడిచి అడిగితే - అలాగే అన్నాడు. మరొకసారి తనకి పని ఉందనీ పొరుగువారితో వెళ్ళమనీ అన్నాడు..తనకి చాలా కష్టం అనిపించింది...

అవన్నీ తల్చుకొంటూంటే శశికి ఏదో పెద్ద లోటులాగ కనిపించసాగాయి... మొదటినించీ ఇలాగ తన జీవితాన్ని జమాఖర్చులు చూసుకోవడంలో ఆమె చాలా ఆత్రుత చూపింది...కాని, ఎంతసేపూ అతను తనయెడల చూపే గౌరవమూ, మెమ్మదీ, మంచితనమూ జమలలో పడేవి


తలగొట్టుచున్న తలనొప్పియా?



సారిడన్‌ను పుచ్చుకోండి
దీనితో యాస్పిరిన్‌గాని, మత్తు మందులుగాని లేవు-పుచ్చుకొన్నతరువాత నిరుత్సాహపరచే లక్షణములు కలుగవు.
సారిడన్ నొప్పిని పోగొట్టును!


కాని, ఈ ఖర్చులన్నీ ఎప్పుడూ ముందుకొచ్చేవి కావు.

తన నెత్తి నేదో మోసం చేసినట్లనిపించింది శశికి...ఆ ఏకాంతంలో, నిశ్శబ్దంగా ఆమె చేసుకొంటూన్న ఆలోచనలని రేడియో సంగీతం పాడుచెయ్యడంలేదు ... సహాయపడుతోందికూడా. ఆమె తన ఆలోచనలలో కొట్టుకునిపోతూంది.

కాని—తన కేమిటి కావాలింకా?

ఆ ప్రశ్నని మాత్రం శశి తరుచు తనకి వేసుకుని, "ఇంకేం కావాలి?" అనుకొనేది...ఆ ప్రశ్న ఇప్పుడు చాలా బరువుగా తనకి కనిపిస్తోంది. మనస్సుని గట్టిగా పరీక్షించుకుని, తన నిజపరిస్థితులని నిర్ణయించుకోవడానికి ఆ ప్రశ్నకి జవాబు తెలుసుకోవాలి...తన కింకా ఏం కావాలి?

తప్పించుకోవడానికి వీలులేని బలంతో ఈ ప్రశ్న వచ్చింది...ఏం కావాలి?

అతను సాయంత్రం రెండు వందల రూపాయిలూ పట్టుకుని వెడుతూన్నప్పుడు తాను పడిన బాధ జ్ఞప్తికి వచ్చింది శశికి....

"నీ నెక్లెస్ ఒక అప్తుడి భార్య ప్రాణం కన్న ముఖ్యమైన దంటావా, శశీ?"

ఉలికిపడ్డది ఆమె......రెండు వందల రూపాయలకోసం తాను సంకుచితంగా ఆలోచించిందని అత నసుకున్నాడు... కాని, తా నెందుకు బాధపడిందో అతనికేం తెల్సు?

తనకేం కావాలో శశికి తెలుసును... సుందరానికి తెలీదు...

ప్రక్కనఉన్న పుస్తకం తీసింది శశి... ఆలోచనలనించి తప్పించుకోడానికి ... మెమ్మదిగా రేడియో ఆఫ్ చేసింది. చదువుతూనే నిద్రపోయింది.

*　　*　　*

అర్ధరాత్రి దాటిఉంటుంది. తలుపు తట్టిన చప్పుడుకి మెలకువ వచ్చింది శశికి... లైటు వెలుగుతోనే ఉంది...చేతిలో పుస్తకం నలుగుతూంది.

కలత నిద్రలోనే లేచి తలుపు తీసింది శశి...తన కళ్ళు తడిసిఉన్నాయని ఆమెకి తెలీదు.

లోనికి వచ్చి తలుపువేసి బట్టలు మార్చుకున్నాడు సుందరం. పూర్తిగా తెలివి తెచ్చుకుని కుర్చీలో కూర్చున్నది శశి.... గడియారం చూసింది...ఒంటిగంటా ఇరవై అయిదు...

సంవత్సరాలనించి తప్పించుకుని తిరుగుతోన్న రోషిలాగ కనిపించాడు సుందరం శశికి...అలాగే చూస్తూ కూర్చున్నది.

బనీను తొడుక్కుని ఆమెవైపు తిరుగుతూ, "నిద్ర పాడు చేశానా శశీ?" అన్నాడు సుందరం.

"కనిపిస్తోందిగా!"

ప్రయత్నం లేకుండానే అన్నది శశి.

"ఆమెకి చాలా ప్రమాదంగా ఉన్నందున - కొంతసేపు ఉండాల్సివొచ్చింది"

"అహా(..."

"భోంచేశావా ?"

"ఆ(...మీరు..."

"అక్కడ చేశాలే..."

"మంచిపని చేశారు..."

"అది కాదు శశీ—అరే! కళ్ళలా ఉన్నాయేం? తడికూడా—ఏడుస్తున్నావా శశీ!"

శశి సిగ్గుపడ్డది...జాగ్రదవస్థలో తాను దాచుకున్న ఉద్రేకాలు నిద్రావస్థలో తనని జయించాయి-తనకి తెలీకుండా.

"లేదు..."

శశి లేచి తన మంచంమీద పడుకొన్నది...అతనితో ఆ పరిస్థితిలో ఇంకా మాట్లాడడం ఇష్టంలేక.

"నామాట విను శశీ...నేను వొద్దాం అనే అనుకున్నాను...కాని అక్కడ చాలా అవసరంగా ఉండాల్సివచ్చింది...వాడు చాలా గాభరా పడిపోయాడు..."

శశి కష్టంగా ఒత్తిగిల్లింది.

"నీకోపం అందుకేగా!"

"కాదు - కాదు - నన్ను పడుకోనీండి"

లేని కాఠిన్యం వచ్చిందా మాటలలోకి... సుందరం తెల్లబోయాడు. తనకి తెలిసినంత వరకూ శశిలో అంత కాఠిన్యాన్ని అతనెప్పుడూ చూడలేదు.

"సరే..."

ఉదాసీనంగా అని, లైటార్పి పడుకున్నాడు సుందరం...తానింటికి రాలేదని శశికి కోపంగాలేదు ... డబ్బు పట్టికెళ్ళినందుకు......

*　　*　　*

ఉదయం లేచేసరికి శశి తాను క్రొత్త పరిస్థితుల్లోనికి అడుగు పెట్టేనని తెలుసుకున్నది ... ఇంతకాలమూ తాను గుర్తించుకోలేని పెద్ద అగాధాన్ని కళ్లు తెరిచి చూడగలిగా ననుకొన్నది.

ఎండిపోయి, నిస్సారంగా తన జీవితం సాగుతోన్నది ... తనని ప్రేమించేవారూ, తనకోసం బాధపడేవారూ లేరు.......

నిద్రపోతోన్న సుందరంవైపు తేలికగా చూసి, తన పనులకి ఉపక్రమించింది శశి... పళ్ళు తోముకుంటూన్నంతసేపూ ఆలోచన లలాగ పరిగెడుతూనే ఉన్నాయి...

కొద్దిసేపట్లో కాఫీచేసి, తాను త్రాగి అతనికోసం ఫ్లాస్కులో పోసింది...మరో

అరగంటకి కాని అతను లేవడు - మామూలుగా అయితే. ఇవాళ ఇంకా ఆలస్యం కావొచ్చును.

ఇతరకృత్యాలుకూడా ముగించుకుని గదిలోకి వచ్చింది శశి ... అత నింకా నిద్రపోతూనే ఉన్నాడు. టైము పిడుస్నర... పదిగంటలకి ఆఫీసుకి పోవాలి - చాలా వ్యవధి ఉందిలే - అనుకున్నది.

రాత్రి చదువుతూ వొదిలేసిన పుస్తకం తీసింది ... ఎక్కడ చదువుతూ ఉందో కూడా గుర్తుకి రాలేదు. నవ్వుకున్నది - ఏం చదువూ!

ఎనిమిదయేదాకా ఆపుస్తకంతో గడిపింది .. సుందరం అప్పటికి నెమ్మదిగా లేచేడు. శశి తన పుస్తకంతోనే ఉండిపోయింది. మామూలుగా తాను అతనికోసం టూత్ బ్రష్ సిద్ధంచేసి, నీళ్ళిచ్చేది ... ఆ సంగతే తనకి జ్ఞప్తికొచ్చిందో లేదో...

అతను బయటికి వెళ్లాక రేడియో పెట్టింది- రికార్డులకోసం ... అప్పటిదాకా అతన్ని డిస్టర్బ్ చెయ్యలేక ఊరుకుని. కొంచెం సేపటికి అతను బయటినుంచి వస్తూ, "ఉదయం రేడియో పెడతావనుకున్నాను ... తెలివి వస్తుందని..." అన్నాడు.

"ఏం?" అన్నది శశి - ప్లాస్కులో కాఫీ కప్పులో పోసియిస్తూ.

"ఉదయం - అక్కడికి వెళ్లాలనుకున్నాను..."

"అహా..."

ఆవిషయం అతను జ్ఞప్తిచేసేసరికి కరగుతోన్న శశి మళ్ళా గట్టిపడ్డది.

తొమ్మిదయేదాకా అతను పేపరుచూస్తూ కూర్చున్నాడు. ఆమె వంట పూర్తిచేసింది.

తొమ్మిదయాక ఒక్కసారిగా లేచి సుందరం బట్టలు వేసుకోసాగాడు - శశి ఆశ్చర్యపడ్డది ... భోజనం చెయ్యకుండా ఆఫీసుకి వెళ్తాడా?

కాని, అడగడం ఆమెకి ఇష్టం లేదు. ఆవిషయం గ్రహించనట్లు ఊరుకుంది... అతను బట్టలు వేసుకోవడం ముగించి తొందరగా వెడుతూ - "వొస్తే మధ్యాహ్నం వస్తాను. నాకోసం చూడకు" అని చెప్పి వెళ్ళాడు.

తెల్లబోయింది శశి ... ఆమాత్రం దానికి అప్పటిదాకా ఎందు కాగాడు? ... లేక, తనమీద కోపమా?

తానేం చేశానని? ఆయనని తనపద్ధతులు మార్చుకోమని అనలేదు... అడ్డగించనూలేదు ...తాను చేయాల్సినపనులు తానూచేస్తూనే ఉన్నది...ఎందుకా కోపం?

రాత్రి తానలా అన్నాననా?

తానేమన్నది? ... నిద్రలో వచ్చినా ఏమీ అనకుండానే తలుపు తీసింది...

బహుశా అతని ప్రశ్నకి ఒక ఉపన్యాసం తాను జవాబుగా ఇవ్వలేదు...అదే నేరం అయితే—కానీమన్నది శశి. అడుగులకి మడుగులు వత్తుతూ తాను ఎందుకు సేవ చెయ్యాలి?

ఎటొచ్చినా ఆడవాళ్ళమీదికి వొస్తుంది- అనుకుంది శశి ..ఎంతో ఉన్నతంగా ప్రవర్తించకపోతే సంకుచితదృష్టి అంటారు... ఆయన ఏదో చెయ్యదలచుకుంటే, తాను పతివ్రత అయితే, "చిత్తం—అంతకన్న గొప్పపని ఏముంది!" అని ఆయనకి నమస్కరించాలి...అలాగ చెయ్యకపోతే, తాను వొట్టి స్వార్థపరురాలంటారు... ఆయన అలాగే అనుకున్నారు. అలాగ చేస్తే, తన విధిని నిర్వర్తించుకున్నది మాత్రం అవుతుంది.

మానవత్వం-ఆడదానిలో రాక్షసత్వం- అవుతుంది...అనిపించింది శశికి...తలుచుకున్నకొద్దీ తన ప్రవర్తన మానవమాత్రులకి ధర్మంగానూ, అతని ప్రవర్తన చాలా క్రూరంగానూ, అధికారయుతంగానూ కనిపించసాగింది.

అతను మారిపోయాడనుకున్నది శశి .. తాను మారిపోయింది...ఆమె తన జీవితంలో క్రొత్త అధ్యాయం...ప్రారంభమైనట్లు భావించుకున్నది.

* * *

సుందరం ఆ రోజంతా మిత్రుడి ఇంటి దగ్గరే గడిపాడు. గోపాలం అసలే పిరికి మనిషి...దానికితోడు సహాయం చెయ్యడాని కెవరూ లేరు. రాత్రి అంతా క్రిటికల్ గా గడిచింది రోగికి.

ఉదయం శశి ప్రవర్తన అతనికి కొంచెం కష్టం కలిగించింది. తనతో ఆమె ముభావంగా ఉండడం చూస్తే, రెండు వందల కోసమేనా! అనిపించింది. శశి అలాగ ప్రవర్తించగలదని అత నెప్పుడూ అనుకోలేదు. డార్జిలింగ్ పోదామని అనుకున్నప్పుడు తానామెకోసమే అంతా చేస్తున్నాననే విషయం ఆమెకి తెలీదనీ, ఆ ప్రయాణం వాయిదా వేసినంతమాత్రాన ఆమె అంత కోపగించుకుంటుందనీ, తనని హృదయహీనుడిగా జమకడుతుందనీ అతను ఊహించుకోలేదు.

తాను గోపాలంకోసం శశితో తగవు పెట్టుకోడం అనవసరమేమోనని అతని కనిపించకపోలేదు. కొంతసేపు పేపరు వెనుక ఆ విషయమే ఆలోచించుకున్నాడు... కాని-అంత నిర్దయుడిగా ఉండిపోవడానికి అతని అంతరంగం సమ్మతించలేదు. "జీవితాలకి కొలతలు రూపాయిలూ అణాలూ కావు - హృదయ సౌకుమార్యమూ, సానుభూతీ!" అనుకున్నాడు. భోజనంకోసం కూడా ఉండ బుద్ధి వెయ్యలేదు. చివాలున లేచి వెళ్ళాడు.

సాయంత్రంఅయేసరికి గోపాలం కుదుటబడ్డాడు. సుందరం ఇంటికి బయలుదేరాడు. సామాన్యంగా ఆసరికి శశి గదిలో కూర్చుని తనకోసం ఎదురుచూస్తూ ఉండేది...... రేడియోతో కాలక్షేపం చేస్తూ. కాని, ఇవాళ తలుపు వేసిఉంది...

నెమ్మదిగా తలుపు తట్టాడు సుందరం... రాత్రి నిద్దర చాలకా, పగలంతా తాపత్రయంతోనూ, తల అంతా బాధగా ఉన్నది.

కొద్దిసేపట్లో శశి తలుపు తీసింది. అతను నెమ్మదిగా లోపలికి వెళ్ళి కోటు మాత్రం తీసి, జోళ్లు విప్పి మంచంమీద కూలబడ్డాడు. ఒక్కరోజుకి తా నిలా అయాడే! గోపాలం ఎలాగ బాధపడ్డాడో! అనుకున్నాడు.

తలనొప్పి క్రమంగా హెచ్చసాగింది. నుదురు చేత్తో పట్టుకుని పడుకున్నాడు. ఏం చెయ్యడానికీ పాలు పోలేదు. మందు మాత్రం ఏముంది! ఆస్ప్రి మింగాలి. తన కది పనిచెయ్యదు.

శశి కాఫీ తెచ్చింది. తనకి తాగాలని లేదు. వొద్దన్నాడు. 'ఏం!' అని శశి అడగ

'పాలుడ్రిన్'
మలేరియాను తరిమివేయును
ICI
ICP 181

# ★ రూపాయిలా - అణాలా ★

లేదు - తాను చెప్పలేదు. రెప్పలు బరువెక్కి, క్రమంగా అతను నిద్రపోయాడు.

కాఫీ టేబుల్ మీదే ఉండిపోయి, చల్లారింది. శశి ప్రక్కగదిలో కళ్ళు చింత నిప్పుల్లాగ చేసుకుని ఆలోచిస్తూంది... "ఎందుకో కోపం?" అని.

మరో గంటకి సుందరం లేచి బయటికి వెళ్ళాడు ... ఆమె మాట్లాడలేదు. అతనూ ప్రయత్నించలేదు.

రెండుమూడురోజులు గడిచేసరికి ముభావంగా ఉండిపోడం ఇద్దరికీ అలవాటైపోయింది. మొదట తన భావాలని అర్థం చేసుకోకుండా సుందరం అలా ఆ డబ్బు దానం చేశాడని శశి కోపగించుకొన్నది: తరవాత అతను తనమీద కోపం తెచ్చుకునేంత మూర్ఖత్వంతో, తన భావాలని గ్రహించనందుకు ఆమెకి కోపం వచ్చింది. తనకి కావాల్సింది డబ్బు అని అతననుకున్నాడు; అంతకన్న అడుగు ముందుకు వెయ్యలేకపోయాడు.

యాంత్రికంగా అతను భోజనం చేస్తున్నాడు - ఆఫీసుకి వెళ్ళి వస్తున్నాడు - ఆమె ఇంటిపనులు చేస్తూంది. ఆమె ఆ నిశ్శబ్దతని అలవాటు చేసుకుంటూంది. ఆడవాళ్లు ఒక్కసారిమాత్రమే పొరపాటు చెయ్యగలరు...ఆతరవాత అంతా ఆ పొరపాటు ఫలాన్ని అనుభవించడంతోనే గడుపుతుంటారు - అనుకుంది శశి. తానా అనుభవానికి సంసిద్ధురాలు కావడమే లక్ష్యం చేసుకున్నది.

కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహామచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు, గ్యారంటి చికిత్స, క్యాటలాగు ఉచితం. జి. వి. రెడ్డి అండ్ కో., (రిజిష్టర్డు) "భాస్కరాశ్రమము" గోపాలపురం, తూ. గోదావరి.

నపుంసక తైలం

అంగనరములు బలహీనత చెంది చిన్నదైన తిరిగి యథాప్రకారమై పూర్తి సౌఖ్యమను భవించుటకు 48 ఏండ్లు ప్రఖ్యాతి చెందిన గ్యారంటీ మందు. 1 సీసా రూ 10/- లు. వి. పి. రూ 1-4-0

కావలసినవారు 1/4 ముందుగా పంపేది.

డా॥ రత్నం సన్సు మెడికల్ హాల్, మలకపేటబిల్డింగ్స్, హైద్రాబాదు-దక్కన్

ఒక నెల సుమారుగా అలా గడిచిపోయింది—నిశ్చయంగా శశి జీవితం కొత్త మార్గంలో సాగిపోతూంది. ఆమెకి ఉన్నదల్లా ఒక్కటే ఆలోచన: తానతని దృష్టిలో ఉన్నంత నీచురాల్ని కానని ఎలాగ తెలియజెయ్యడమా అని.

జీతం వచ్చినరోజు అందరూ హుషారుగా ఉంటారు—రాబోయే కొద్దిరోజుల సౌఖ్యాలని తలుచుకుని. కాని సుందరం హుషారు, దగ్గర డబ్బుఉంటే, తనదగ్గర చెయ్యిచాచినవాడు ఊరికే పోనక్కర లేదనే.

ఈనెల జీతం చేతికి రాగానే, సుందరం ఆలోచనలు ఇంకోలా పరిగెట్టాయి— గోపాలానికి తాను క్రిందటినెల జీతం ఇచ్చినదగ్గరనుంచీ శశి వాలకం అతనికి చాలా కష్టం అనిపించింది. వాస్తవంగా తాను ఆమెని చాలా ఉన్నత దృక్పథం కలదాన్నిగా భావించాడు - ఇప్పటిదాకా ఆమె అలాగే కనిపించింది—పనుల్లోకూడా. కాని, అప్పటినించీ ఆమె తన భావాలని, నిజాన్ని దాచి బయట పెడుతోందని అతను తెల్సుకున్నాడు. కొంచెం డబ్బుకోసం తనతో కలహించే శశిని, మరికొంచెం డబ్బుతో కొనుక్కోవచ్చును—అనుకున్నాడతను.

దైవికంగా పాతబాకీ ఏదో ఆ రోజే తిరిగి అందడంతో అతని చేతిలో అయిదు వందలదాకా కనిపించాయి. అన్నీ పర్సులో ఉంచుకుని అతను సాయంత్రం ఇంటికి వచ్చాడు. ఏదో చదువుకొంటూన్న శశి లేచివెళ్ళి గ్లాస్కు తెచ్చి టేబిల్ మీద ఉంచి తన పనిలో నిమగ్నురాలైంది.

అది మామూలు కార్యక్రమం అయిపోయింది. క్రీగంటితో అటుచూస్తూ సుందరం "కప్పులో పోస్తావా?" అన్నాడు.

శశి జవాబివ్వకుండా లేచి, కప్పులో కాఫీ పోసి తిరిగి తన పనిలోకి వెళ్ళిపోయింది. నిశ్శబ్దంగా కాఫీ తాగడానికి అలవాటుపడిన అతను ఇలా అనడం ఆమెకి ఆశ్చర్యం కలిగించకపోలేదు; కాని, ఆ భావాలని పుస్తకంలోని అక్షరాల్లో ఆమె దాచుకోనగలిగింది.

కాఫీ త్రాగి, సుందరం కుర్చీలో కూర్చుని సిగరెట్ ముట్టించాడు.

"సినిమాకి పోదామా?" అన్నాడు ఇంకేమీ పనిలేనట్టు.

పుస్తకం వదకనించే, "మీరు వెళ్లండి" అన్నది శశి.

"నువ్వో?"

"నేను—రాను."

"ఏం?"

"రావాలని లేదు"

"ఏం చేతో !"

"వొచ్చిన ప్రతీ సినిమాకి నేను విధిగా బయలుదేరడం లేదనుకుంటాను..."

"అలా లేదు కనుక నే..."

"సరే... నేను రాను"

ఒక నిముషం నిశ్శబ్దం ఆవరించుకొన్నది.

"శశీ!" అన్నాడు సుందరం.

"ఊఁ...?"

"ఇంక—నాతో మాట్లాడవా?"

"ఇప్పుడు మాట్లాడడంలేదా?"

"అలా కాదు...కొద్దికాలం క్రితం చూశావా-ఎంత సరదాగా ఉండేదానివో! ఎంత చక్కగా మాట్లాడేదానివో!- అలా"

శశి మాట్లాడలేదు. ఆమెకి ఈ సంభాషణ బాధ కలుగజేస్తూన్నా, ఆ పూర్వపు దినాలని జ్ఞప్తికి తెస్తూన్నా, సుందరం నిజం గ్రహించాడేమోననే ఆశ కలుగసాగింది.

"చెప్పు శశీ!"

"ఏమని?"

"ఒక చిన్న విషయంకోసం, నన్ను నీవు దూరంగా చేశావు. నేను చేసింది పొరపాటు కావొచ్చు - కాని, అందుకోసం ఇంత చెయ్యాలంటావా?"

శశికి ఈమాటలు సూటిగా తగిలాయ్ - తనదే పొరపాటు అని అతని ఉద్దేశం.

"నే నేం చెయ్యలేదు..."

"మరి - నువ్వు చాలా మారిపోయావ్!"

"క్రొత్త విషయాలు తెలిసినప్పుడు మనుషులు క్రొత్త మార్పుల్ని పొందుతూ ఉంటారు..."

"నీకు తెలిసింది - "

"మీకూ తెలుసును"

సుందరం ఏమీ అనలేక ఊరుకున్నాడు ...తరువాత ఏంచెయ్యడమో అతనికి బోధపడలేదు ... తాను హృదయం ఇచ్చిన ఈ ఒక్క జీవి తనబాకీ ఎగవేస్తే తానేం చెయ్యగలడు !

"పోనీ- ఒకటి చెప్పు శశీ ... డబ్బు నేను ఎలాగో నీకు తెచ్చిఇస్తే నువ్వు కోపం తగ్గించుకుంటావా?"

శశి చిరాకుగా లేచింది - సుందరం హృదయంలో ఉన్న భావాలమీద ఆమెకి చాలా అనుమానం ఉంది ... కాని, అవి ఇంత నీచంగా ఉంటాయని ఆమె అనుకోలేదు. ఆమె ఏమీ మాట్లాడకుండా ఊరుకుంది.

"వెళ్ళకు శశీ - చెప్పు..."

సుందరం నెమ్మదిగా ఆమెదగ్గరికి వచ్చాడు. ఆమె అటు తిరిగింది. రెండుభుజాలతో నూ

ఆమెని తనవైపు తిప్పుకుంటూ - "నా మనసులో బాధ నీకు తెలుసును శశీ ... నువ్వు కూడా నన్ను విదిలించివేస్తే నాకు శాంతి ఉండదు...చెప్పు" అన్నాడు.

శశి అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది ...అలాగే చూస్తూ ఉండిపోయింది.

"ఇవిగో శశీ...అయిదు వందలు. నీ కెప్పుడు కావాలన్నా బయలుదేరు. నేనూ వస్తాను..."

అతను పర్సులోనుంచి డబ్బుతీసి డ్రాయర్లో ఉంచాడు. శశి అటు చూడ లేదు...నిజానికి ఆమె అతని కళ్లనించి తన చూపుని మరలించలేదు ..'ఏమిటి తనం టూన్నది? తన మనస్సుని రూపాయిలతో కొంటాననా?...ఎంత చవక అయిపోయాను! హృదయాలెంత సుళువుగా దొరుకుతాయి!' అనుకున్నది.

"నేను-నా ఉద్దేశాలతో దూరంపోయి నీకు పొరపాటు చేశాను శశీ...నీ ఉద్దేశాలనే మరిచిపోయాను. ఈ కలహాన్ని పెంచడం నా కిష్టంలేదు...అది నీ డబ్బు.. నీ యిష్టంవచ్చినట్లు వాడు..."

శశి వింటోంది...జవాబివ్వలేని స్థితిలో ఉంది. నెమ్మదిగా అతని చేతులు విడిపించుకుని కుర్చీలో కూర్చున్నది.

ఎవరో తలుపు తట్టారు.

చికాకుగా వెళ్ళి సుందరం తలుపు తీసి- "అరె! నువ్వా! ఇలా ఉత్తరమైనా రాయకుండా వచ్చావేం?" అన్నాడు—మరుక్షణం ఇంట్లోకి శ్యామలని తీసుకొస్తూ.

"ఏం వొదినా!...కులాసా?"

ఆ మాటలు వినిపించేసరికి మళ్ళా ప్రపంచంలో పడింది శశి...ఆమెని పలుకరించి యోగక్షేమాలు అడిగి, కొంత కుదుటపడ్డది.

శ్యామల సుందరం చెల్లెలు...ఒక్కత్తే.. ఆమె భర్త మద్రాసులో ఉద్యోగం చేస్తున్నాడు. జీతం తక్కువ కావడాన్న అడపా తడపా సుందరం సాయపడుతూనే ఉంటాడు...కాని, ఇంతహఠాత్తుగా రావడానికి కారణం ఏమిటో శశికీ, సుందరానికీ కూడా అంతుపట్టలేదు.

శశికి తన విపరీత పరిస్థితినింత దైవికంగా తప్పుకోగలిగినందుకు కొంత సంతోషంగానే ఉంది.

రాత్రి సుందరమూ, శ్యామలా భోజనాలు చేశాక, శశి భోజనం చేస్తూన్నది. అవతలి గదిలో వాళ్లిద్దరూ మాట్లాడుకుంటున్నారు.

"...అయిన్ని నాలుగు వొందలూ డిపాజిట్ కడితేగాని వాళ్లు ఉద్యోగం చెయ్యనివ్వరుట అన్నయ్యా!.. ఈ వారంలో కట్టక తప్పదుట...అందుకని..."

సంగతంతా బోధపడింది శశికి......ఆ మొత్తంకోసం ఆమె వచ్చింది.

కొన్ని నిమిషాలు ఊరుకుని, మెల్లిగా సుందరం-"నాదగ్గర ఏమీ లేదే...ఎలాగ?" అన్నాడు.

శశి చాలా ఆశ్చర్యపడింది...శ్యామల అంటే ప్రాణం సుందరానికి. అతనే ఇలా అంటున్నాడా?

"ఈ వారం ఇవ్వకపోతే......ఆయన ఉద్యోగానికి నీళ్ళు వొదులుకోవాలి..." బాధగా అన్నది శ్యామల.

అతనేమీ మాటలాడలేదు...శ్యామల ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయ్. అతనెందుకని అలాగ అన్నాడు?...ఆమెకి ఇవ్వడం ఇష్టంలేదా?......శ్యామలకోసం అతను ప్రాణమన్నా ఇవ్వ సిద్ధమౌతాడే!

"కొంచెం ముందుగా రాస్తే ఏదో చేద్దును...ఇప్పుడు చికాకు వచ్చిపడ్డది... సరే...ఉండు. చూద్దాంగా!"

"నేను—రేపు మెయిలుకి వెళ్ళాలి!"

"రేపా?"

"ఆఁ...ఆయనకి మతిపోయింది. దగ్గర నేనూ ఉండకపోతే ఎలాగ!...ఇంకా వారం టైం ఉందిలే...ఎక్కడైనా కుదిరితే పంపు—నువ్వుమాత్రం ఏం చేస్తావు!"

అక్కడికి ఆసంభాషణ అంతంఅయింది. శశి ఆశ్చర్యం మాత్రం మితిమీరిపోయింది. సుందరం చెల్లెలితో - తన ప్రాణసమానంగా చూసుకొంటోన్న శ్యామలతో - తనదగ్గర ఉంచుకున్న అయిదువందలు లేవని అబద్ధం ఆడుతున్నాడు!

కాని ఆ విషయాన్ని నమ్మలేకపోయింది శశి...ఇందులో ఏదో పొరబాటు...అవును ...ఆడబ్బు తనకిచ్చినట్లుగా లెఖ్ఖవేసుకుని ఉంటాడు సుందరం......

సాయంత్రం ఆ నిమిషంలో శ్యామల రావడాన్ని శశి ఈవిషయంగురించి తీవ్రంగా ఆలోచించడానికి వీలుకాలేదు. అందులోని సత్యం ఇప్పుడు తనకి తెలుస్తున్నది...అతను తనకి అయిదువందల రూపాయిలిచ్చి...మళ్లా

"మా శిశుసంరక్షణాలయానికి మీరేమైనా ఇప్పించాలి."

అసలే చిరాకుగా వున్న గృహయజమాని: - "నాకున్న డజనుమందిపిల్లల్లో మీకెక్కావలసినంతమందిని తీసుకుపొండి; నాకేం అభ్యంతరం లేదు."

అనుకున్నదిశశి ... ఈసారి కోపంతోనూ, అసహ్యంతోనూ - "రూపాయి లిచ్చి హృదయాలు కొంటారుట!!" అని.

పనులు ముగించుకుని గదిలోకి వచ్చేసరికి శశి మనస్సంతా చాలా చిరాకుగా ఉన్నది ... సాయంత్రం సుందరం డ్రాయరులో ఉంచిన డబ్బు ఆమె కళ్లపడడంతో ఒక్కసారి ఆ భావాలన్నీ పెలికివచ్చాయి.

అవల శ్యామల నిద్రపోతోంది ... సుందరం వాసాలకి కళ్ళని ఒప్పజెప్పి ఏమిటో ఆలోచిస్తూన్నాడు.

మనసులోఉన్న భావాలన్నిటినీ దాచుకుని, నెమ్మదిగా "అయితే - ఆడబ్బు మీది కాదన్నమాట!" అన్నది శశి.

"ఏ డబ్బు?"

"సాయంత్రంది..."

"కాదు - అది...నీది"

"అలాగా!...దానం చేశారా?"

"లేదులే...బాకీ తీర్చాను"

"నాకు మీరు బాకీ ఏమీ లేరే!"

"నీకు తెల్సు - "

మంచంమీదని ఉన్న సుందరం ప్రక్కకి పర్సుని విసిరి.

"మళ్ళా అలా అన్నా, డబ్బు ఇచ్చినా- ఆనాటితో చెల్లు" అన్నది శశి...చిన్న కంఠస్వరంతోనైనా, చాలా వాడిగా.

"శశీ—!"

జమ్మివారి 'లివర్‌క్యూర్'
పిల్లల లివర్ & స్ప్లీన్ వ్యాధుల చికిత్సకు, నివారణకు
బ్రాంచి ఆఫీసు & వైద్యశాల
తాడంకివారివీధి, బకింగ్‌హాంపేట పోస్టు
విజయవాడ.
పై అడ్రస్సునందు మా డాక్టరు గారిని కలుసుకొని సలహా పొందవచ్చును
జమ్మి వెంకటరమణయ్య & సన్సు, H.O, మదరాసు-4
విజయనగరం బ్రాంచి - ఓరుగంటివారివీధి.

టెలిఫోనులో: "హాలో, అది ఫైర్ స్టేషనేనా?"

"అవును."

"చూడండి, మా దొడ్లో ఈ మధ్య మంచి పువ్వుల మొక్కలూ, కూరలపాదులూ వేసి పెంచాను......"

"ఇంతకీ నిప్పంటుకున్నది ఎక్కడ?"

"ఇప్పుడిప్పుడే పువ్వులు పూస్తున్నాయి; కాయలు కాస్తున్నాయి......"

"ఏమిటయ్యా, నీ సొద. నిప్పంటుకున్నదా, లేదా ఇంతకీ?"

"అదే చెప్పబోతున్నాను; అంత తొందరైతే ఎలా? మా పక్కఇంటికి నిప్పంటుకున్నది. మీ మనుషులు ఫైర్ ఇంజన్లతో వచ్చినప్పుడు కాస్త మా దొడ్డికి ఎడంగా వుండి మీ పని కానిచ్చుకోమని చెప్పండి. థాంక్స్..."

## [illegible] యలూ - అకాలా 

"మరేమీ అనబోకండి..ఆవిడకి ఇచ్చినా సరే...మరేం చేసినా సరే. మనుష్యులందరికీ ఉంటాయి మానమూ మర్యాదలూను.."

శశి ఇంకేమీ మాట్లాడలేదు–సుందరమూ నోరు కదపలేగు. సంపెంగ అని కౌగలించుకుంటే నాగు ముద్దుపెట్టుకున్నట్లు అతను బాధపడుతున్నాడు..."పశువు!" అని ఒకసారి మనసులో అనుకున్నాగు.

ఉదయం శ్యామల డబ్బు తీసుకుని వెళ్లిపోయింది.

* * *

మర్నాడు సాయంత్రం ఆఫీసునుంచి రాగానే సుందరం కాఫీ త్రాగకుండా బయటికి వెళ్ళిపోయాడు...రెండోనాటి నుంచీ శశి సాయంత్రం అతనికి కాఫీ ఉంచడమే మానింది. మూడోరోజున అతను కాఫీ అడిగాడు. లేదన్నది. సరేనన్నాడు. వెళ్లి హోటలులో త్రాగాడు.

ఆలోచించినకొద్దీ అతనికి జీవితం దుర్భరం కాసాగింది - శశిమీద కోపం హెచ్చసాగింది. ఇంట్లో అడుగుపెట్టడం అంటే అతనికి ముళ్ళమీద అడుగు వెయ్యడంలా ఉన్నది...తానేం చేశాడని శశి ఇలాగ పగసాధిస్తోంది?...ఆమెకేం లోటు చేశాడు?

ఆమెని తాను ప్రేమించాడు...తమ కిద్దరికీ మధ్య తెరలు లేవనుకున్నాడు.. అందుకనే, అంత నిస్సంశయంగా ఆమెదగ్గిర డబ్బుకూడా తన మిత్రులకీ, అవసరంలో ఉన్నవాళ్లకీ ఇవ్వడానికి తీసుకోగలిగాడు.. ఇంత నీచంగా ఆమె ఆలోచిస్తుందని తానెన్నడూ అనుకోలేగు.

ఆమెకి కోపం వచ్చినా తాను సర్దుకుని తిరిగి ఆ డబ్బు ఆమెకే ఇచ్చేశాడు...ఆమె ఇష్టంవచ్చినట్లు చెయ్యమని. కాని – అంత వాడిగా ఆమె దానిని తిరస్కరించడం ఎందుకు?

తనకి తెలుసును—మూర్ఖత్వం. ఒకసారి చేతులనించి దాటాక ఆడవాళ్ళు ఇలాగే పరిస్థితుల్ని అధ్వాన్నం చేస్తారు. చివరకి.. చివరకి...

ఒళ్ళు జలదరించింది సుందరానికి. చివరకి–ఏమౌతుంది?

రెండేళ్ళ క్రితం డాక్టర్ అన్న మాటలెందుకో అతనికి జ్ఞప్తికి వచ్చాయి... "జాగ్రత్త సుందరం! నీకు హార్టు చాలా నీరసంగా ఉంది..." అతను తన మిత్రుడు. తాను నిజం తెల్సుకుంటేనే మంచిదని చెప్పేడు..."ఏమీ బాధలేదు - కొంచెం నిర్వికారంగా ఉండడం నేర్చుకో..."

తా నేమైపోతున్నాడు?...గత రెండు నెలలనించీ తన మనస్సుకి బొత్తిగా శాంతి లేకుండాపోతూంది. అందుకే ఆరోగ్యం చెడుతోందా?

ఒక్కసారి అతన్ని దైన్యం ఆవరించింది...తానలా బాధపడితే ఎక్కువ కాలం బ్రతకడు...ఆసంగతి తనకి తెలుసు. కాని—శశి...

నెమ్మదిగా ఇంటివైపు నడిచాడు. సంజ వెలుగులు క్రమంగా చీకట్లకి తావిస్తున్నవి. గుమ్మందగ్గరనిలబడి, తెరచిఉన్న తలుపులు త్రోశాడు. ఒక్కసారి నీరసం ఆవరించినట్లయింది. నెమ్మదిగా గదిలోని కుర్చీలో జేరబడ్డాడు. రేడియో సన్నగా పాడుతోంది – శశి మరో కుర్చీలో కూర్చున్నది. అతని రాకనే గమనించనట్లు ఆలోచిస్తూంది.

కొద్ది నిమిషాలున్నాక, నెమ్మదిగా లేచి రేడియో కట్టేశాడు సుందరం. మొదట కొంచెం ఆశ్చర్యపడినా, ఆ ఆశ్చర్యాన్ని దాచుకుంది శశి.

"నీతో మాట్లాడాలి శశి!"

ఆమె జవాబివ్వకుండా అలాగే కూర్చున్నది – సుందరం నెమ్మదిగా బల్లమీద సగం కూర్చున్నాడు. దీపపు కాంతులు ఆమె ముఖంమీద పడి కళ్ళల్లోకి ప్రతిఫలిస్తున్నాయి...ఓరోజున తాను కళ్లల్లో ఆనందలోకాలు దర్శిస్తానని కలగన్నాడు..

"ఎంత కాలం ఇలాగ–మూగకాపురాలు చేద్దాం శశి?"

ఆమె ఒకసారి తల ఎత్తి తిరిగి దించుకున్నది.

"నేను చాలా బాధపడుతున్నా నని ఏమాత్రం హృదయం ఉన్నా నువ్వు గ్రహించగలవు శశి!... మొదట నేను అనాలోచితంగా తొందరపడి ఉంటాను ... కాని, నీకు కష్టంకలిగించడం నాకెన్నడూ ఇష్టం ఉండదు. సరి దిద్దుకుందా మనుకున్నాను..."

అతను కుర్చీలో కూర్చొని జవాబుకోసం ఆమెవంక చూశాడు. ఆమె ఏమీ మాటలాడకుండా ఆలోచిస్తూన్నది.

"ఒక్కసారి అనంతంలోకి జరిగిపోయిన ఏకు క్షణాన్ని తిరిగి వెనక్కి తీసుకురావడం ఎంత అసంభవమో, జరిగిన విషయాలని రద్దుచెయ్యటం అంతేననీ - నీకు తెలుసును. మానవమాత్రుడు చేసేది తనకి సాధ్యమైనంతవరకూ జరిగినదానికి ప్రతిక్రియ చెయ్యడమే అదే చేశాను. ఏంచెయ్యమంటావు?"

"నేనేమీ చెయ్యమనలేదు -"

"కాని - ఇలాగ మూగగా, ఎడారుల లాగ, జీవించడం అసంభవం శశి!"

"తప్పనివిషయాలకి సరిపెట్టుకోవడం - మానవమాత్రులు చేసేపని!"

"అంతేనా శశి?"

"అక్కరాలా"

లెంపకాయ తిన్నా సుందరం అంతబాధపడేవాడుకాదు. తన సౌమ్యత ఇలా వ్యర్థం అయిపోతుందని అతనెప్పుడూ అనుకోలేదు. అతని హృదయంలో ఉన్న అర్ధ్రిస్థానాల్ని త్వరగా కోపం ఆక్రమించుకున్నది.

"అయితే - నువ్వు ఇక్కడ ఉండడమూ అనవసరమే -"

తొందరగా అనేశాడు ... శశి షాక్ తిన్నట్లు కుర్చీలోనుంచి త్రుళ్ళిపడి తిరిగి సర్దుకుని, "సరే -" నన్నది.

సుందరం తిరిగి బయటికి వెళ్ళిపోయాడు. తాను తొందరపడ్డాడు ... అనుమానమే లేదు. కాని - శశి ఏమీ కదలలేదు...తాను తొందరపడ్డాడు...ఔను...

ఆమె వెళ్ళిపోతుందా? నిజంగా... వెళ్తుంది-తప్పకుండా. ఆమెకున్నంత అభిమానం ఎవ్వరికీ ఉండదు...కాని—డబ్బు? తానివ్వాలా?-ఇవ్వడు...ఎలా వెళ్తుంది?.. వెళ్ళదు...కాదు డబ్బు ఎలాగైనా సంపాదిస్తుంది-వెళ్తుంది...ఆమె మాటలు పడదు. పోనీ...వెళ్ళి క్షమాపణ...ఆమె కది సరిపడదు...

కెరటాలలాగ ఆలోచనలు వొచ్చి పడుతున్నాయి ... సుందరానికే ఆలోచనా తోచడం లేదు పార్కులో కూర్చున్నాడు .. బయటికి వచ్చాడు. ఎనిమిది దాటింది.. ఇటూ అటూ తిరిగాడు ... తొమ్మిది... ఇంటివైపు మరలాడు

నిశ్శబ్దంగా ఆమె వడ్డించింది—ఏమీ తినలేకపోయాడు.."తొందరగా అన్నాను—నా ఉద్దేశం అదికాదు శశీ!" అనడానికి ప్రయత్నించాడు—మాటలు దొరకవు—శబ్దాలు రావు—తనతోటే తాను అనుకోబోయాడు—మౌనంగానే లేచాడు...

కొన్ని నిముషాలలో ఆమె వచ్చి పడుకున్నది—అతను ఏమీ మాట్లాడలేకపోయాడు—ఆ యిద్దరూ ఆ స్థితిలోనే ఉన్నారు ...

ఉదయం.

అన్నీ యాంత్రికంగా జరిగాయి .. మౌనంగా. అతను భోజనంచేసి ఆఫీసుకి వెళ్ళాడు.

శశి గదిలోకి వచ్చింది. తనతో తెచ్చుకున్న సూట్ కేసులో బట్టలూ, రెండు పుస్తకాలూ పడవేసుకుంది. తనకోసం అలుకున్న పూలుపుల్లో వడూ, అన్నయ్య ఇచ్చిన శాలువా సంచీలో ఉంచుకుంది ... చెవి గాజుల జత తీసి పొట్లం కట్టింది—బంగారపు దుకాణం ఆ వీధి చివరనే ఉంది...

మూడు గంటలు ....

కూతవేసి మెయిల్ స్టేషన్ని దూరం చేసుకుంటూన్నది—క్రమంగా కదిలిపోతూ శశి తన కంపార్టుమెంట్ లోనించి ఒకసారి బయటకి చూసింది.. కళ్లు వద్దన్నా నీళ్లతో నిండిపోయాయ్.. తాను పొరపాటు...

అన్ని మాటలని తుడిచిపెట్టి తొందరగా లోనికి వచ్చి ఒకమూలనకూర్చున్నది. పుస్తకం తెరిచింది.. సామాన్యంగానే కనపడా లని. అవతలి ప్రక్క ముగ్గురు అమ్మాయిలు-కాలేజీవాళ్లలే ఉన్నారు-కూర్చున్నారు.. ఒకామె తనవంక చూస్తున్నది...తనతో సంభాషణ మొదలుపెడితే బాగుండును—

"ఆ పుస్తకం ఏమిటండీ?"

తనకి ధైర్యం వచ్చింది - మరి కొద్ది క్షణాల్లో తన స్నేహితురాలైంది ఆమె... మిగిలిన వాళ్ళూను.

తాను అన్నయ్యకి టెలిగ్రాం ఇచ్చింది -స్టేషన్‌కి రమ్మని. బెంగలేదు...

సాయంత్రం సుందరం ఇంటికి వచ్చేసరికి తాళం వేసిఉంది - ప్రక్క ఇంటివాళ్ళు తాళం ఇచ్చారు. తలుపు తీసి మంచంమీద కూలబడ్డాడు...అంత పని చేసింది! అతని తల తిరిగినట్లయింది - అంత తొందరగా శశి వెళ్ళిపోయిందా?...

ఏదో కోల్పోయిన భావం అతన్ని బలంగా ఆవరిస్తూన్నది. కాదు - కాదని ఎంతగా వాదించుకున్నా ఆగకుండా నింపుతూన్నది ఆ శూన్యాన్ని...తల పట్టుకున్నాడు - దురాగ్రహాలు!...అనుకున్నాడు...తన స్వభావాన్ని అర్థం చేసుకోకుండా జీవితం నరకప్రాయం చేసింది!...

*   *   *

అతను ఆఫీసుకి వెళుతున్నాడు - వొస్తున్నాడు ..యంత్రంలాగ. స్నేహితులందరు అడుగుతారు - అతను కారణం చెప్పడు...

మూడు నెలలు...

అతను శశిని మరిచిపోవాలనే అనుకున్నాడు - నిశ్చయించుకున్నాడు...కాని అనుక్షణమూ ఆమె జ్ఞప్తికి వస్తుంది...తానన్న మాటలు జ్ఞప్తికి వస్తాయి......తాను నేరం చేశానని బాధపడతాడు.. తనతో తానలాగ కాదని వాదించుకుంటాడు. పూర్వం ఆ ఇంట్లో ఆనందంగా గడిపిన రోజులూ, గంటలూ, క్షణాలూ జ్ఞప్తికి వస్తాయి - కళ్ళు తడి అవుతాయి . మళ్ళీ ఎప్పుడైనా అలాగ ఆనందంగా ఉండగలనా! అనుకుంటాడు ... ఈసారి కన్నీళ్ళు నెమ్మదిగా...

కొత్తవాడు: "రామయ్యగారింట్లో ఉన్నారా?"

పనిమనిషి: "ఎందుకూ?"

కొత్త: "పొలం తాలూకు డబ్బు..."

పనిమనిషి: "ఆయన నిన్ననే ఏదో వూరు వెళ్ళారు..."

కొత్త: "......ఇచ్చేసేద్దామని వచ్చాను."

పనిమనిషి: "ఇవ్వాళ పొద్దున తిరిగి వచ్చారు. పిలుస్తా ఉండండి."

త్వరగా వీధిలోకి వెళ్ళిపోతాడు ... అటూ ఇటూ తిరుగుతాడు - హోటల్లో భోజనం చేసివస్తాడు...దిగాలుగాఆకుర్చీలో కూర్చుంటాడు. ఒక్కొక్కప్పుడు రేడియో పాడుతూఉంటుంది ... అలాగ రాత్రి జాగరం చేస్తాడు.

మళ్లా ఉదయం ..మళ్లా మధ్యాహ్నం - సాయంత్రం - రాత్రి.

*   *   *

"సారీ మిష్టర్ - ఏమీ చెప్పలేము ... హార్ట్ చాలా బలహీనంగా ఉంది ... ఏమీ ప్రమాదం లేకపోవచ్చును. *Fatal* కావచ్చును ..*Exite* కానివ్వకండి .."

నెమ్మదిగా కళ్ళు తెరిచాడు సుందరం ...నీరసంగా ఉంది - తానెక్కడ...అరే! ...గోపాలం...భార్య...ఏమి టిది?

(55-వ పేజీ చూడండి)

గీత
సాంబారు - రసము పొడి
ఘుమఘుమలా వాసనతో రుచికరమైన సాంబారు, రసము. మూడు నిమిషాల్లో తయారు చేయవచ్చును. ఉప్పు చింతపండు. పప్పు వగైరాలన్నీ యిందులో కలిసి వున్నవి. శాంపిల్ ప్యాకెటు 10 అ మాత్రమే పోస్టేజి 8 అ. అదనం. 1 పౌ. ప్యాకెటు 1 కి రు 1-8-0 పోస్టేజి వేరు.
GEETHA RASAM POWDER
గీతా అండ్ కో., నెం. 42, నాగప్పైయర్ వీధి, మద్రాసు-5.

# అర్థబలం-అంగబలం

"ఏమర్రోయి: దొంగ దొంగ! పట్టుకోండి పట్టుకోండి:" అంటూ సూరమ్మగారు కేక పెట్టేసరికి చుట్టుపక్కల వాళ్లంతా తలో కర్రా బుజాన్నేసుకుని పరుగెత్తుకొచ్చారు. తీరా వాళ్ళంతా వచ్చేటప్పటికి దొంగ కాలికి బుద్ధి చెప్పనే చెప్పాడు—అంతూ పంతూ లేకుండా. పోయినదేమిటయ్యా అని ఆరాతీస్తే, ఆమె మెళ్ళో గొలుసు వెనుక భాగం, ఒక మూడుకాసుల ముక్క. కత్తిరించుకుపోయాడు దొంగ.

"అబ్బ: పట్టుమని పది గంటలే నా కాలేదు; పదిమంది కల వాళ్ళింట్లో భోజనాలుకూడా పూర్తికాలేదు; మా యింటాయన యిప్పుడే పొలాన్నుంచి వస్తే అన్నం పెట్టిపంపి యిప్పుడే యిలా వచ్చాను; అప్పుడే యెలా దాపురించాడమ్మా యీ దొంగా?" అంటూ ఒక రైతాంగన బుగ్గలు నొక్కుకుంటోంది.

"అయినా యీకాలం దొంగవాళ్ళకి వేళాపాళా లేదే: కన్నుండగా గుడ్డు మాయం చేస్తారు. ఇంకా పదిగంటలేనా కాందే; ఊళ్ళో నలుగురూ యింకా తిరుగుతూంటేనే యీ దొంగతన మేమిటంట!" ఒక పోతుబరి మీసం మెలేస్తూ అన్నాడు.

"వాళ్ళు మాత్రం నిద్రాభంగం చేసుకుంటారుటండీ! దొంగవాళ్ళైతే మాత్రం మనుష్యులు కారూ!" అన్నాడొక హాస్యరసికుడు.

అయితే మొత్తంమీద దొంగను పట్టుకోడానికి వచ్చినవాళ్ళంతా దొంగ దొరక్కపోగా, లోకాభిరామాయణం మొదలెట్టారు. నగపోయిన గృహస్థు మాత్రం దిక్కుమొహం వేశాడు. ఒకటా! రెండా! మూడుకాసుల ముక్క! ఎన్నాళ్ళు ఆర్జిస్తే యీ సొమ్ము మళ్ళీ సంపాదించగలడాయన?

"అయితే యింత పెందరాళే నిద్దరేమిటయ్యా; బాబూ?" అన్నాడందులో ఒక పెద్దమనిషి:

"ఏమిటో మొన్న పిల్ల పెళ్లిచేశారా— నిద్దరా; నిప్పులా; నిద్దరకి మొహంవాచి పడుకున్నారు, కాబోలు పాపం!" అంటూ మొదలెట్టాడు, వాళ్ల కష్టసుఖాలన్నీ ఎరుగున్న మరో పెద్దమనిషి.

వీళ్ళలా అనుకుంటూండగానే మళ్ళీ అవతల వీధిలోనుంచి గల్లంతు: "అయ్యయ్యో: ఏమర్రోయి; సుబ్బారెడ్డి కొడుకు వీధిలో పడుకుంటే వాడిని దొర్లించి వాడి తలగడాలు పట్టుకుపోయాడం"టూ.

ఇక్కడ జనం అంతా అక్కడ మూగారు. "దొర్లించి పట్టుకుపోయాడయ్యా—తలగడాలు" అంటూ నలుగురూ దొంగ కనిపించకపోగా నవ్వులాట మొదలెట్టారు.

"అయినా ఒంటిమీద చెయ్యేసి అప్పడాల పిండిలా దొర్లించేస్తూంటే నీ కెలా మెలుకువ రాలేదురా. నీ దెంత మొద్దు నిద్దరా!" అంటూ అందరూ తలోమాట మొదలెడితే, ఆ యింట్లో ముసలమ్మ గబగబా యివతలకువచ్చి "వేసవికాలం కాదు నాయనా! పొలాల్లో పని చేసుకు చేసుకు యింటికొస్తే ఒళ్లెరగని నిద్దర పట్టింది. పెద్దముండాదాన్ని, యీ దగ్గుతో నాకే నిద్దర పట్టక దొడ్డితలుపు ఏదో చప్పుడైనట్టు అను

## అయ్యగారి రాఘవమ్మ

మానంతగిలిల తా దరగా వళ్లు మాస్తూనుగదా; ఎవడో మనిషి గబగబా పరుగెడుతున్నాడు. తీరావచ్చి యింట్లో అందరినీ కేకలేస్తే, 'యిందాక నన్ను దొర్లించినవాడు దొంగే కాబోలు! మీ రెవరో అనుకున్నా; బద్ధకంకొద్దీ లేవలేదు; తలగడాలు కొత్తవి పోయాయ'నుకుంటూ వీడు మొదలెట్టాడు." అంటూ కథ పూర్తిచేసింది; ముసలమ్మ.

ఏమయితేనేం-మొత్తమీద దొంగ రెండు చోట్లా కూడా తెలివిగానే దొంగతనంచేసి పారిపోయాడు.

"ఈమధ్య దొంగతనాలు ఎక్కువగా జరుగుతున్నాయి: ఇకమీదనేనా మనం జాగ్రత్తగా కాలక్షేపం చెయ్యాలి" అంటూ తీర్మానించుకుని ఒంటిగంటయ్యాక ఎవళ్ళ యింటికి వాళ్ళు దారితీశారు.

నాలుగురోజులు గడిచాయి. ఈ నాలుగు రోజులూ కూడా ఆ ఊళ్ళోవాళ్ళెవళ్ళూ సినీమాలకు కూడా పోలేదు, దొంగలకు జడిసి. దొంగలజాడ తీయడంలో ప్రతివాళ్లు ప్రతిభ చూపిస్తూ, ప్రతీవిషయం ఓ కంట కనిపెడుతూనే ఉన్నారు.

పెత్తటిథికి పక్కసందులో రంగాయమ్మగారు అరుగులు అలుక్కుంటోంది. ఒక ముష్టిది వెనకపాటుగా వచ్చి "అమ్మగారూ: బంగారు మూడుకాసులకు తక్కువుండదు; నాలుగురూపాయల కిచ్చేస్తాను కొంటారా:" అంది.

రంగాయమ్మ కాశ్చర్యం వేసింది: తన కళ్ళముందరే జిగేలుమని మెరుస్తోంది బంగారు. నాలుగు రూపాయలు! ఎంత చవక! తన కళ్ళను తానే నమ్మలేకపోయింది: "ఎంత అమ్మా!" మళ్ళీ ప్రశ్నించింది:

"నాలుగు రూపాయల కిచ్చేస్తా నమ్మగారూ; మూడుకాసులకు తక్కువుండదు." అంది ముష్టిది.

భేష్: ఎంత అదృష్టం; ఇవాళ పొద్దున్నె లేచి యెవళ్ళ మొహం చూచిందో; మంచి బేరం; ఆలస్యంచేస్తే ఏవళ్ళైనా యింకో రెండు రూపాయ లెక్కువిచ్చి ఎగరేసుకుపోవచ్చు, అనుకుంటూ "యిలాతే అమ్మా!" అన్నది. దానిచేతిలో బంగారం ముక్క పుచ్చుకుని, మళ్ళీ అది బంగారం అవునో కాదో అని అంతట్లోనే అనుమాన పడి, లోపలకు వెళ్లి గబగబా వాళ్ళాయన నాలుగురోజుల క్రితం యింట్లో తెచ్చిపెట్టిన గీటురాయిమీద గీసిచూసి సంతుష్టిపడి గబగబా వంటింట్లో కెళ్లి గదులుపెట్టెలో దాచుకున్న నాలుగు రూపాయలు తెచ్చియిచ్చి దాన్ని పంపేసింది. సంతోషం పట్టలేక మళ్ళీ మళ్ళీ ఆ బంగారాన్ని చూసుకు మురిసిపోతోంది రంగాయమ్మగారు.

ఇంతట్లో ఆమె భర్త వెంకయ్య వేంచేసేటప్పటికి, తాను చేసిన ఘనకార్యాన్నంతా యేకరువు పెట్టేసిందామె. మొదట్లో అతనూ నమ్మలేకపోయాడు; తమ అదృష్టాన్ని స్తుతించుకున్నాడు: మళ్ళీ ఏం తోచిందో-గీటు కొస్తుందో లేదో చూద్దామన్నాడు:

"నేనేమంత తెలివితక్కువ దాన్నండీ; గీటు పెట్టి చూసే కొన్నాన"ంటూ గీటురాయి అందిచ్చిందామె. కాని అదేమి చిత్రమో గీటురాయిమీద గట్టిగా ఆ మగవాడిచేత్తో గీటు పెట్టగానే యిద్దరి మొహాలు తెల్లబోయాయి.

"రాగే: నీ మొహం ఈడ్చా! నీ తెలివి కాలా, రాగిముక్కకు బంగారు పూసు

కొచ్చిందే: ఆ ముండ ఎక్కడుందే:" అంటూ వీధిని పడ్డాడా రాగిముక్కతో ఆ పెద్దమనిషి:

అప్పటి కప్పుడే ముష్టిది బజార్లో రెండు రూపాయలు మార్చేసి రెండురోజుల్నుండి తిండికి మొహం వాచిన కొడుకూ, తనూ మస్తుగా పొట్టనింపుకుని చెట్టునీడని సేద దీర్చుకుంటున్నారు.

గోజుకుంటూ రొప్పుకుంటూ వచ్చిన రంగాయమ్మగారికీ, ఆమె భర్తకీ యీ ముష్టిది కళ్ళబడగానే, శక్తి యినుమడించింది. భార్య చెప్పీ చెప్పడంతోనే, భర్త ఆ ముష్టిదాన్ని యివతలకి లాగి తగిలేదీ తప్పేదీ చూడకుండా ఎడాపెడా మద్దెల మోత మోగించాడు. ముష్టిదాని కళ్ళవెంట నీరుధార కట్టింది. ఒళ్ళువాచి రక్తం కారుతోంది. జనం యిసుక చల్లితే రాలకుండా మూగారు.

ఇంతట్లో ఎక్కడనుంచో దైవంలా, ఆ ఊళ్ళో పెద్దమనిషి అనిపించుకునే, హంస బాబుగారు వచ్చారు కాని, లేకపోతే ఆ ముష్టిదాని ప్రాణం అక్కడ యెగిరి పోయేదే.

హంసబాబుగారికి చిన్నప్పుడు వాళ్ళమ్మా నాన్నా పెట్టిన పేరేమో గాని, వాళ్ళు ముద్దుకు చిన్నప్పుడు పిలిచే ఆపేరే జనసామాన్యంలో యిప్పటికూడా అలవాటైపోయింది: హంసబాబుగారంటే ఆ ఊళ్ళో అందరికీ మహా గౌరవం: యింకా చెప్పాలంటే ఆఊళ్ళో చిన్న చిన్న తగూలు చాలా ఆయన తీర్పుతోటే పరిష్కారం అవుతాయి. ఆయ నెంత చెబితే అంత; ఆయనో ధర్మరాజనీ ఆ గ్రామంలో ఓ నమ్మకం......ఆయన ఎక్కువ ముసలాడు కాడు; ఎక్కువ కుర్రాడు కాడు; బి. యే. పాసయి, యిటీవల వచ్చిన రైతు హక్కులకు అందరిలాగే ఆయనకూడా భయపడి తనకున్న పొలాలూ, తోటలూ చూచుకుంటూ, ఎల్లప్పుడూ, నవ్వుతూ, చిన్నలతో చిన్నవాడిలాగా, పెద్దలతో పెద్దమనిషిలాగా, వ్యవహరిస్తూ రైతులతో రైతుగా సలహాలిస్తూ, రాజుల్లాంటి వాళ్ళతో రాజదర్పంతో రాజకీయాలు చర్చిస్తూ కాలక్షేపం చేస్తూంటాడు. అందుకే ఆయన కంతగౌరవం ఆఊళ్ళో.

హంసబాబుగారు రావడం చూచి జనమంతా పక్కకు తప్పుకుని బాటయిచ్చారు. వస్తూనే హంసబాబు ఏమిటన్నట్లు చూచాడు:

రంగాయమ్మగారు, మొగుడూ, రొప్పుకుంటూ గోజుకుంటూ కథంతా పూసగుచ్చినట్లు చెప్పారు. "ఈముష్టిముండ మమ్మల్ని మోసంచేసి బంగారమని నమ్మించి నాలుగు రూపాయలు కాజేసింది:" అంటూ:

ముష్టిదికూడా తనగోడు విన్నవించుకుంది నీరసంగా "రెండురోజుల్నుంచి పిడికెడు మెతుకులకు మొహం వాచి, చచ్చిపోయే బిడ్డను చూడలేక యీపాపం చేశానుబాబూ;

ప్రొద్దున్న
రోజంతా



ఆటల తరువాత
హాయిగా



పడుకొనేటప్పుడు
నుండేటందుకు...




ఎల్లగాచేయునటువంటియు, సువాసనతో గూడుకొన్నటువంటియునైన
హిమాలయా బుకే పౌడర్లను వాడండి
రెండు దివ్యమైన ఆరొమిక్ పౌడర్లు




అన్నివిధ వాతావరణములలో చర్మమును కాపాడేటందుకు

HBP. 7-X30 TL

# అర్థబలం - అంగబలం

మా రోజుల మాయల్లో యిదేమాత్రం బాబూ!" అంటూ :

హంసబాబు క్షణంలో గ్రహించాడు- ముష్టిదాని ఆవేదనా, గృహస్థుల దురాశా. "మా నాలుగు రూపాయలు మాకియ్యముండా:" అంటూ మళ్ళీ రంగాయమ్మ భర్తా మీదకొస్తూంటే, హంసబాబు అడ్డు వచ్చాడు :

"ఉండండి; మీరలా మీ చిత్తం వచ్చినట్లు ఆ మనిషిని కొట్టడానికి వీల్లేదు."

"మమ్మల్ని మోసం చేసి......" అవతలాయన అంటూండగా మధ్యలోనే అందుకున్నాడు హంసబాబు :

"ముష్టిదాన్ని మోసం చేసి దగ్గఱ దగ్గఱా మూడుకాసుల బంగారం నాలుగు రూపాయలకు కొనాలకోవడం మీది మోసం కాదూ?" ఈ చివరిమాట హంసబాబు నోటినుండి కటువుగా కూడా వచ్చింది. మొగమంతా కందగడ్డలా మారిపోయింది.

అవతల పార్టీవారొక్క క్షణం స్తంభించిపోయారు; తరువాత తేరుకుని మొదలుపెట్టారు.

"అయితే..."

"మీది శుద్ధ అన్యాయం, అక్రమం: దౌర్జన్యం: మళ్ళీ మాట్లాడితే ఆమెను కొట్టిన దెబ్బలన్నీ మళ్ళీ మిమ్మల్ని కొడితే అప్పుడు మీకు తగిన శిక్ష అవుతుంది" అరిచాడు హంసబాబు !

"అయితే మమ్మల్ని తన్నిస్తావా ?"

"తన్నించాలా : మంచి మన్షికి ఒక మాట; మంచిగొడ్డుకు ఒక దెబ్బ" అన్నాడు హంసబాబు. తరువాత తన జేబులోంచి ఒక రూపాయి తీసి ముష్టిదానికిచ్చి, రెండు సోడాబుడ్లు యిప్పించి, దాన్ని పంపేసి యింటికి మళ్ళాడు హంసబాబు...


రత్నపురుషవేష్టం

(WITH CALCIUM & GOLD)

సువర్ణము మొదలగు భస్మములు చేర్చబడినవి. నిస్సత్తువ, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము అత్యుష్ణము, గుండెదడ. కాళ్లతీపులు మొదలగు సమస్త మేహములుహరించి బలమును, కాంతిని, నరముల పటుత్వము. అపరిమిత ధాతుపుష్టి నిచ్చును. అనేక యోగ్యతాపత్రములు గలవు.

20 తు డబ్బి రు. 3-12-0 పోస్టేజి 1-0-0

ఇండియన్ మెడిసన్ హౌస్,
లక్ష్మీటాకీసు రోడ్డు - విజయవాడ-2.


ఆ ఊళ్లో రంగాయమ్మ మొగుడు, వెంకయ్య, ఓ భూస్వామి. లోభి అని పేరుపడ్డా, అతను తల్చుకుంటే డబ్బుతో కాని కార్యం లేనే లేదు. ఆ సంఘటన జరిగిన నాటినుండీ హంసబాబుమీద కత్తికట్టి కక్ష తీర్చుకోడానికి చూస్తూనే ఉన్నాడు.

హంసబాబుకు 'రామన్న' అని ఓ నౌకరున్నాడు : వాడు కూడా ఒకప్పుడు వెంకయ్య యింటికి వాచి ముష్టెత్తుకున్నాడుకూడా: అలాంటివాణ్ణి చేరదీసి కూడేడుతున్నాడు హంసబాబు. దానికంతకీ కారణం ఏమిటంటే అతను హరిజన ప్రియుడు: విశేషించి దీనబాంధవుడు.

నౌకరు రామన్న తన పాలేరుతనంలోనూ, తల్లీ తనూ చేసుకున్న కూలిడబ్బులలోను ఓ ముప్ఫైరూపాయలదాకా కూడబెట్టుకున్నాడు; అదిపెట్టుకుని తన రైతుగారి సాయంతో ఓ యిల్లుకట్టుకుని ఓ యింటివాడవాలని వాడి ఉద్దేశం...

ఈ సంగతి కర్ణాకర్ణిగావిన్నారు రంగాయమ్మ, మొగుడూ; భార్యాభర్తలిద్దఱూ తమ తెలివితేటలన్నీ ఉపయోగించి బాగా ఆలోచించారు. తాము తల్చుకుంటే కానిదేముంది కనక; వాడి సొమ్మున్నస్థలం కనుక్కోడానికెంతో సేపు కూడా పట్టలేదు. కారణం; వాడిదో చిన్నగుడిసె. మెల్లిగా గుడిసెలో కన్నంచేసి ముప్ఫైరూపాయలూ తన పాలేరుచేత తెప్పించాడు వెంకయ్య. అంత ఘనకార్యం చేసినందుకు అందులో అయిదోవంతు వాడికి బహుమానం చేసి తన ఔదార్యాన్ని చూపించాడు.

తరువాత కార్యక్రమానికి ప్రొద్దున్నే లేచి చెప్పులు తొడుక్కుని, తెల్లబట్టలు కట్టుకొని, కోటుతొడుక్కుని పాగా చుటుకొని పట్నానికి బయలుదేరివెళ్ళి పోలీసిన స్పెక్టరును కలుసుకొని ఫలానావారి పాలేరు 'రామన్న' అనేవాడు తన యింట్లో కూలికొచ్చి యాభైరూపాయలు కాజేశాడంటూ కేసుపెట్టి వచ్చాడు. ఈ కేసులో హంసబాబుకూడా తనపాలేరును వెనకేసుకుని రాకపోడనీ, తన ధన సహాయంతో హంసబాబు మీద కక్షపూర్తిగా తీర్చుకోవచ్చనీ అతని ఉద్దేశం.

ఎర్రటోపీలవాళ్లు ఊళ్లో కొస్తారనీ, పాలేరురామన్న వెంకయ్యయింట్లో డబ్బు ఎత్తుకుపోయాడనీ, అంచేత అతనిమీద వెంకయ్య కేసుపెట్టాడనీ, వూరంతా పాకిపోయింది. రామన్నయింట్లో డబ్బుపోయి యేడుస్తూంటే పైన యిదొకటి!

మాలగూడెం అంతా అట్టుడికి నట్టుడికిపోయింది. వాళ్ళెవళ్ళో ఎప్పుడూ ఎరక్కుండానే తమమీద అలాంటి అపవాదు ఆయనలాంటి వాడు వేశాడంటే, వాళ్ళకి దిక్కు దివాణం తోచలేదు. చుట్టుపక్కల వాళ్ళిద్దఱు ముగ్గురు రాత్రి పాలేరుతో మోతుబరి రైతు వెంకయ్య అక్కడికి రావడం, పాలేరు రామన్న యిల్లు పరికించి చూడ్డం, తరువాత వాళ్ళు గబగబా వెళ్ళిపోడం చూచామన్నారు. అయినా అంత పెద్ద ఆసామీతో తమకు మాటేమిటన్నట్టూ ఊరుకున్నామన్నారు వాళ్ళు.

బహుశా రామన్న యింట్లో సొమ్ము కాజేసి పైగా కేసుపెట్టిన వాళ్ళు వాళ్ళే నని క్షణంలో తీర్మానించేశారు మాలగూడెం అంతా.

కాని యింతట్లో అందులో కొందఱు పెద్దలాలోచనా పూర్వకంగా వెంకయ్య పాలేరు సూరిగాడిని పిలిపించారు.

"నిజం సెబితే సెప్పావు, దేవుడు మొగం సూసి; లేకపోతే నిన్ను కులంలోంచి వెలేస్తాం; గూడెంలోంచి గెంటేస్తాం. నువు మీ కాపుతో కలిసి రామిగాడింట్లో డబ్బు తీశావా లేదా?" అంటూ నిలబెట్టారు.

మొదట్లో సూరిగాడు తటపటాయించాడు: కాని వాళ్ళంతా గట్టిగా కొట్టి చంపేస్తామనేటప్పటికి నిజం చెప్పేశాడు.

వెంటనే ఆ మూకంతా ఒక్కకట్టుగా పోగయి వెంకయ్య యింటిమీద పడ్డారు. ఆలోచనా విచక్షణా లేకుండా, పైనా పక్కా చూడకుండా అరుగుమీద కూచున్న వెంకయ్యని కిందికి లాగి "మోతుబరి రైతువై యుండి యిదయ్యా చేసేపనీ" అంటూ వెంకయ్యకు దేహశుద్ధి బాగా చేశారు. వెంకయ్య పొలి బొబ్బలెట్టేస్తున్నాడు.

ఊళ్లో వెతికినా మనిషి లేకుండా అంతా అక్కడ పోగయారు. జరిగిన సంగతంతా తెలుసుకున్నారు. "పెద్దా చిన్నా లేకుండా యీ మాలవాళ్లెంత పన్నాగంపన్ని యెంత చేశారూ" అన్నారు కొందఱు వెంకయ్య పక్షంవాళ్లు.

"అయినా యీయనగారు చేసిన పని మాత్రం బాగుందీ?"అన్నారు కొందఱు బుద్ధిమంతులు.

"కోర్టుకీడ్చి వీళ్లపని పట్టాలి" అన్నారు కొందఱు.

"మాయింట్లో సొమ్ము కాజేసి మామీదే కేసెడతాడా; డబ్బున్నోళ్ళయితే యేమాటాడినా సెల్లుద్దనుకుంటున్నావయ్యా" అంటూ మళ్ళీ మీదకొచ్చాడు పాలేరు రామన్నా, వాడివెనకా లింకోనలుగురూ.

పెద్దమనషులందఱూ కలిసి మళ్లీ దౌర్జన్యం జరగకుండా అడ్డుకున్నారు.

"ఈ పాలేరువాడి కింత శక్తి యెక్కడ నుంచి వచ్చిదీఅంట. ఈపని చేయించిందంతా ఆ హంసబాబు; గడ్డగూబలా మొహంవాడూను; వాడిపని పడితే వీళ్ల రోగం చప్పగా కుదురుతుంది" అని అరుస్తూ ఒళ్లు దులుపుకు లేచాడు వెంకయ్య.

"చాల్లేవయ్యా! మాలోళ్లచేత చెప్పు దెబ్బలు తిన్నది చాలకుండా యింకో కోరు కెక్కి నలుగురు నోళ్ళలో కూడా పడాలీ! ఇంక ఊరుకో; సిగ్గుచేటు" అన్నారు కొందరు.

"దీని అంతు కనుక్కుని" అంటూ విస విస నడిచిపోయాడు వెంకయ్య.

"ఇది ప్రజాస్వామికమయ్యా" అనే వాళ్ళు కొందఱూ, "డబ్బుంటే సరా: డబ్బుకు తగ్గట్టుగా మంచితనం లేకపోతే;" అని కొందఱూ, రుమాళ్లు అడ్డంగా పెట్టుకుని రోడ్డుమీద పొట్టపగిలేలా నవ్వుతూ కొందఱూ ఎవళ్ళ యిళ్ళకు వాళ్ళు పోయారు.

వెంకయ్య కోర్టులో దావా పడేశాడు; పాలేరు రామన్న ఈ తగూకి కారకుడు; దానికి సూత్రధారుడు హంసబాబు; అంచేత అతడు సాక్ష్యం.

అనుకోకుండానే ధర్మారావు యింటికి రావటం హంసబాబు కాశ్చర్యం కలిగించింది. కాలేజీ విరమించి యింటికి వచ్చాక యే రెండు మూడుసార్లో తప్పించి యీ స్నేహితులిద్దఱూ కలుసుకున్నది లేదు

సరే; స్నేహితు లిద్దరూ భోజనాలు చేసి పిచ్చాపాటీ చెప్పుకుంటున్నారు; సంభాషణమధ్యలో చెప్పేశాడు నవ్వుతో ధర్మారావు "ఏరోయి హంసా నీమీద భలే కేసు వచ్చిందే"

"లేనిపోనిది కల్పించారురా" అన్నాడు హంసబాబు.

"నాకు తెలుసులే! ఫిర్యాది కేసు తన పక్షం అయ్యేలా చూడమని వెయ్యి రూపాయిలు, రెండు వందల మామిడిపళ్ళు యిచ్చాడు: వద్దనడం ఎందుకూ! పుచ్చుకున్నానురా; నిజం చెబుతున్నాను; పిల్లలందఱూ సుఖంగా రెండురోజులు తిన్నారు; ఇలాంటివాళ్ల డబ్బు ఇలాగే గుంజెయ్యాలి; కాని నీ క్షేమం అపకారం చెయ్యను సుమా; అలా అనుకుంటావేమో" అన్నాడు; జరిగిన సంగతంతా చెప్పుకుని స్నేహితు లిద్దఱూ మరోసారి నవ్వుకున్నారు.

కచ్చేరీలో మేజస్ట్రేటు ధర్మారావుగారు యీ కేసును గురించి తీర్పు చెప్పే రోజు వచ్చింది.

సూరిగాడు తలకట్లు పొల్లుపోకుండా సాక్ష్యం చెప్పేశాడు. సాక్ష్యబలాన్ని పట్టి ధర్మారావు ముద్దాయి నిర్దోషిగా, తీర్మానం చెప్పేశాడు. ఫిర్యాది ఇలాటి అక్రమ నేరాలు జరిపించినందుకు శిక్ష వెయ్యకుండా క్షమించి వదిలేశామనీ, రామన్న యింట్లో పోయిన ముప్పై రూపాయిలు కోర్టువారి యెదుట వెంకయ్య ముదరా యిచ్చుకోవాలనీ తీర్పు చెప్పారు. తన సొమ్మంతా తిని యిలా తీర్పు చెప్పినందుకు మొహం కందగడ్డై మాటరాకపోగా చేసే దేమీలేక ముప్పై రూపాయిలూ ముదరా యిచ్చుకుని బైటపడ్డాడు వెంకయ్య.

"దొంగలే దొరలు; దొరలే దొంగలు; దొంగలు దారిబత్తా పెట్టుకోస్తా రేమిటి;" అంటూ చెప్పుకున్నారు ఊళ్లో అందరూ. "కూటికి లేనివాళ్లూ దొంగతనాలు చేస్తారు. కులకతులతోటీ, పార్టీ కక్షలతోటీ మగ్గే వాళ్ళూ యిలాటి వాటికి గారితీస్తారు; నీతీ నియమం ఎవరికీ" అనుకున్నారుకొందఱు. ★

నవ వికసిత పుష్పం వలె తాజాగా,
మనోహరంగా ఉండండి

హమాం
టాయిలెట్ సబ్బును
వాడుడు






ది టాటా ఆయిల్ మిల్స్
కంపెనీ లిమిటెడ్




టాటా తయారు



# విజ్ఞాన వీధులు

## "డాక్టర్"



చాలా మంది వ్యాధులకు మందులు తెలపమంటున్నారు. పరీక్ష చేసిన మీ వైద్యుడే మందును నిర్ణయించ సమర్థుడు. ఉత్తరముల ద్వారా మందులను నిర్ణయించుట మీకు ప్రయోజనకారి కాదు, మా 'డాక్టర్' కి న్యాయమూ కాదు.

### 148. నక్షత్రాల దూరాలను సామాన్య దైర్ఘ్యమానంలోనే తెలియజేస్తారా?

నక్షత్రాలు భూమికి కోట్లాది మైళ్ళదూరంలో ఉన్నాయి. మాటవరుసకు భూమికి మిక్కిలి చేరువగా నున్న నక్షత్రము రమారమి సూర్యుడు. భూసూర్యుల మధ్య దూరము 9,30,05,000 మైళ్ళు. సూర్యుని తరువాత భూమికి మిక్కిలి దగ్గరగా నున్న నక్షత్రము ప్రోక్సిమా సెంటారీ. భూమినుంచి దాని దూరము 25,000,000,000,000 మైళ్ళు. ఆకాశంలో ఎక్కువ కాంతిమంతమైయున్న సిరియస్ నక్షత్రము భూమికి 51,000,000,000,000 మైళ్ళ దూరంలో ఉంది. సూర్యునకును భూమికిని గల దూరం తొమ్మిదికోట్ల ముప్పదిలక్షల అయిదు వేల మైళ్ళని చదవడం అంత కష్టం కాదుగాని, ప్రోక్సిమా సెంటారీ నక్షత్రం భూమికి ఇరువదియైదు లక్షల కోట్ల మైళ్ళ దూరంలో ఉన్నదంటే ఆ అంకెను చదవడం కొంత కష్టమే. పైగా ఆ అంకెను వ్రాయడం కొంత విసుగుకూడాను. అందుచేత నక్షత్రాల దూరాలను సామాన్య దైర్ఘ్యమానంలో గాక, మైళ్ళకంటె పెద్దయూనిట్‌లో వ్యక్తపరుస్తే చదవడానికి, వ్రాయడానికీ కూడా అనువుగా ఉంటుంది. కాబట్టి నక్షత్రాలదూరాలను తెలియపర్చవలసినపుడు వాటిని మైళ్ళకంటె పెద్ద యూనిట్‌లోనే సామాన్యంగా వ్యక్తపరుస్తారు.

నక్షత్రాలదూరాలను తెలియపర్చడానికి మూడు యూనిట్‌లు (ప్రమాణాలు) వాడుకలో ఉన్నాయి. అందులో ఒకటి కాంతి సంవత్సరము (*Light Year*) కాంతి సెకనుకు 1,86,000 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తుంది. అంటే ఒక వస్తువునుంచి బయలుదేరిన కాంతి ఒక సంవత్సర కాలంలో 1,86,000 × 60 × 60 × 24 × 365 మైళ్ళు అనగా సుమారు 6,000,000,000,000 మైళ్ళు దూరం ప్రయాణం చేస్తుంది. కాంతికిరణము ఒక సంవత్సర కాలంలో ప్రయాణం చేసే దూరాన్నే కాంతి సంవత్సర మంటారు. అందుచేత కాంతిసంవత్సరం ఇంచుమించు ఆరులక్షలకోట్లమైళ్ళకు సమానం. ఈ ప్రమాణంలో చెప్పినపుడు భూమికి ప్రోక్సిమా సెంటారీ నక్షత్రం 4.3 కాంతి సంవత్సరాల దూరంలోనూ, సిరియస్ నక్షత్రం 8.7 కాంతి సంవత్సరాల దూరంలోనూ ఉంటాయి.

నక్షత్రాల దూరాలను తెలియపర్చడానికుపయోగించే రెండవ ప్రమాణం (యూనిట్) పేర్ సెక్ (*Parsec*). పేర్ సెక్ యూనిట్ పరిమాణం కాంతి సంవత్సర పరిమాణం కంటే కూడా హెచ్చు. అది 3.26 కాంతి సంవత్సరాలకు సమానం. నక్షత్రాల దూరాలను నక్షత్రాల పేరలాక్సును (*Parallax*) కనిపెట్టి, దానినిబట్టి లెక్కిస్తారు గదా! భూమినుంచి చూచినపుడు ఒక నక్షత్రం యొక్క పేరలాక్సు '$P$' సెకనులైతే, భూమినుంచి ఆ నక్షత్రదూరం '$\frac{1}{P}$' 'పేర్ సెక్'లు అవుతుంది.

పైని పేర్కొనబడిన రెండు యూనిట్లలోను గాక, ఒక్కొక్కప్పుడు భూసూర్యుల మధ్య దూరాన్ని ఒక యూనిట్‌గా ఏర్పరచుకొని, ఆ యూనిట్‌లో కూడా నక్షత్రాల దూరాలను తెలియచేస్తూంటారు. అయితే భూమికి సాపేక్షంగా తక్కువ దూరంలోనున్న నక్షత్రాల దూరాలను తెలియపర్చవలసి వచ్చినప్పుడే యీ 'యూనిట్'ను వాడతారుగాని మిక్కిలి యెక్కువ దూరంలో నున్న నక్షత్రాల దూరాలను తెలియపర్చవలసినప్పుడుమాత్రం దానిని వాడరు.

—అనంత్.




### చిట్టి ప్రశ్నలకు జవాబులు

—ఎరోప్లేన్ మీద భూమి ఆకర్షణ శక్తి లేకేమి? ఇంజను చెడిపోయినా, ఏ కారణం చేతనైనా పని చేయకపోయినా, భూమి ఆకర్షణవల్లనే కింద కూలిపోతుంది. ఇంజను పని చేస్తూంటే, ముందుకి సాగిపోతూ, విసిరిన పళ్లెములాగ, గాలిలో తేలుతుంది.

—లేదు. భూమిమీద తప్ప మరి యే ఖగోళములోనూ జనసంచారము లేదు. ఏమంటే, ఏఖగోళములోనూ ఉష్ణత భూమిమీదలాగ లేదు. కొన్నిటిలో మానవుడు ముద్దగట్టుకు పోతాడూ, మిగతా వాటిలో మాడి మసి అయిపోతాడు.

—'అరటి చెట్టు'ను వృక్షశాస్త్రజ్ఞులు చెట్టు అనరు. భూమిలో ఉండే దుంప అంతా చెట్టుయొక్క కాండము; 'అరటి

ఒక పార్కులో వైద్యుడు, సంగీత విద్వాంసుడు కలసికొని మాట్లాడుకొంటున్నారు.

వైద్యుడు: అయ్యా! నాకు సంగీతం నేర్చుకోవాలని చాల రోజులనుంచి కుతూహలంగా వుంది. కాస్త నేర్పుదురూ.

సం॥ వి: నాకూ వైద్య వృత్తి నేర్చుకోవాలని వుంది వైద్యం నేర్పుతారా?

వైద్యుడు: ఓ ... అలాగయితే మీరు నాకు సంగీతం నేర్పండి, నేను మీకు వైద్యం నేర్పుతాను.

సం॥ వి: సరే. "నేనొక రాగం ఆలాపన చేస్తాను విని నేర్చుకొండి" — అని ప్రారంభిస్తాడు......

వైద్యుడు: ఇదేరాగమండీ?

సం॥ వి: దీన్ని "ఆనంద భైరవి" అంటారు. మరొక రాగం వినండి - (అని మళ్ళీ ప్రారంభిస్తాడు)

వైద్యుడు: (క్షణమాలోచించి) ఇది "వసంత కుసుమాకరం" అయివుంటుందండీ...

—కంభంపాటి శ్రీరామమూర్తి,
(విజయనగరం.)

'చెట్టు' అని మనమనేది ఒక పూగుత్తి పండ్లగుత్తి పెట్టబోయే కాడ. మామిడికాయ కోసేశిన కాడ వాడిపోయేటట్లే, గెలకోసిన తర్వాత 'అరటిచెట్టు' అనే కాడ వాడిపోతుంది. ఇంకో కాడకి వేస్తుంది పూగుత్తి.

—విజ్ఞానవీధులకు జవాబులిచ్చేది ఏ ఒక్కరూ కాదు. కొంతమంది శాస్త్రోపాధ్యాయుల కూడలికే మేము 'డాక్టర్' అని పేరు వాడుతున్నాము.

—పాదరసము చేతికి అంటదు నీరూ, నూనెలాగ. అందుకని జారిపోతున్నట్లుంటుంది. తామరాకుమీద నీటిబొట్టు కూడా అంతే కదూ? కాలిన బూరెల మూకుడులో నీళ్ళచుక్కలు వెయ్యండి. ఆ చుక్కలు కూడా వాటికీ పెనానికీ నడుమని వుండే ఆవిరిమీద తేలుతూ జారిపోతున్నట్లుంటాయి.

—మేము 'బెల్లించి' అనే మాట విన్నాము, అందుకే, అది వాడినాము. 'బెల్పించి' అనే మాట ఎవరూ అనగా మేము వినలేదు. అంతమాత్రంచేత మీ 'బెల్పించి' అన్నది తప్పని అనకూడదు. ఒకమాట ఉన్నదా లేదా అనడానికి వాడుకయే ఆధారము. 'జాపోత' అన్న మాటకు 'వగర్పు' అని అర్థము. విశాఖమండలములో వాడతారు. మదరాసువారు 'మొగమాటము' అనడానికి 'దాక్షిణ్యము' అంటారు. 'దయాదాక్షిణ్యములు' అన్న మాటలో 'దాక్షిణ్యము' అన్నదానికిదే అర్థము కాబోలు. అమలాపురము తాలూకాలో కిటికీని 'జాలగల్లి' అంటారు. కొకరపల్లు ఆరామద్రావిళ్ళు 'కనబడరావడము' అంటారు కనబడడానికి దక్షిణదేశములో 'రావడము పడదు' అనడానికి 'రాను పడదు' అంటారు. "శబ్దసిద్ధి లోకము (లోవాడుక)వల్లనే తెలియును." 'బెల్పించి'అని వాడడము వుంటే అదీ రైటే.

—వెన్నెల రాత్రులలో చంద్రుడు భూరేఖకి దగ్గరగా వెలుగుతూన్నప్పుడు, చంద్రుడికి వ్యతిరేక దిశవైపు మేఘము వర్షించి ఆగితే, ఆ మేఘముమీద ఇంద్రధనువు తప్పక ఏర్పడవచ్చును అయితే సూర్యరశ్మివలె వెన్నెల వెలుగు కాంతివంతమైనది కాదు. కనక పగటి ఇంద్రధనువంత కాంతిగా నుండజాలదు.

—నాసికా రంధ్రాలు రెండింటిద్వారానూ ఊపిరి వస్తుంది. పక్క వేసుకుని పడుక్కున్నప్పుడు ముక్కులోని చీమిడి దిగువ రంధ్రానికి అడ్డుపడి, పై చెలనునుంచే ఊపిరి వస్తుంది. కూర్చుని పనిచేసుకునేటప్పుడు రెండు ముక్కు రంధ్రాల ద్వారానూ వస్తుంది ఊపిరి.

—ఫౌంటెన్ పెన్ను, సిరా అయిపోయే స్థితిలో ఉన్న కాస్త సిరానీ కక్కుతుంది నిజమే. పెన్ను ఫీడరు భాగాన్ని స్క్రూతిప్పి విడదీశాక, బేరల్ లో నిండా సిరా పొయ్యండి. నిండిన బేరల్ ని తిరగవేసినా సిరా పడిపోదు. గాలి దానిని పడిపోకుండా నిలబెడుతుంది. ఇప్పుడు బేరల్ ఫీడర్ బిగించి, రాయడానికి కాగితము మీద పెడితే పాళీకి వెనుకనున్న చిన్న కన్నముద్వారా గాలి చిన్న బుడగలు సిరాలోంచి దాటుకుని బేరల్ కొనకి చేరుకుంటుంది. సిరా వాడగా వాడగా బేరల్ లో గాలి చేరి కిందివైపుకి ఒత్తుతుంది. సిరా బేరల్ లో దిగువని చేరి, బొట్టుబొట్టుగా రాతలోకి దిగుతుంది. పైగాలి బుడుక్కుమని బేరల్ కొనకి దాటిపోకుండా మధ్యభాగంలో వున్న సిరా అడ్డుతుంది. సిరా ముగిసిపోయే స్థితిలో పైగాలికీ బేరల్ లో గాలికీ అడ్డున్న సిరాదళసరి తక్కువ. కనక పెన్ను వంచగానే పైనున్న గాలి లోపలికి తప్పుకుపోయి సిరాని కిందికి నెట్టుతుంది. అందుచేత సిరా ముద్దలు ముద్దలుగా పడిపోతుంది. ★

ఆరోగ్యముగా ఉండండి—
మలాశయమును క్రమపరచుడు




ఈనోస్
ఫ్రూట్ సాల్ట్

తాజా గుణము చిరకాలముండుటకుగాను సీసాలలో అమ్మబడును.

"ఈనో" మరియు "ఫ్రూట్ సాల్ట్" అను మాటలు రిజిష్టర్డు ట్రేడ్ మార్కులు



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



రాయబారియగు అరుణముఖుడునూ
గూఢచారియగు నీలవర్ణుడును
ద్వారపాలకుడు దారిచూపగా
హిరణ్యగర్భుని సమీపించినవి.



హిరణ్యగర్భుడు వారిని చూచి,
ఉచిత రీతి సత్కారమొనర్చి
'వచ్చిన కారణమేమ'ని యడిగెను.



"అవధరింపు రాయంచల ఱేడా! - జంబూద్వీపం
పరిపాలించే - చిత్రవర్ణుడే మా రాజు; - ఆయన
పంపెను [illegible]:- "ఎల్లదేశముల కెల్ల దీవులకు
- చిత్రవర్ణుడే అధినేత. - వింధ్యప్రాంతం కూడా
అతని - రాజ్యభాగమే కావున, మీరూ - పటా
కప్పం కట్టాలి. - కప్పం కట్టుటకిచ్చగింపనిచో
- యుద్ధానికి సన్నద్ధులు కండి!"



"మా ఏలిక కడు బలవంతుడని
జ్ఞప్తియుంచుకొని మెలగండి!
మీ యుద్దేశ్యము త్వరగా
తెలిపిన -
నా దారిని నే పోయెదను."



చిత్రవర్ణుని సందేశమ్మును
విన్నవెంటనే హిరణ్యగర్భుడు
రోషకషాయిత లోచనుడై తన
సభికులతో యిట్లన్నాడు:



"విన్నారా ఈ విడ్డూరం? - కీటకములను తిని
బ్రతికే పక్షి - మనకు పంపినది ఈ సందేశం.
- వానికి పటా కప్పం కట్టి - వాని యడుగులకు
మడుగులొత్తుచూ - జీవితమంతా గడుప
వలయునట! - అస్మదీయ ప్రతాపాగ్నికి -
ఇంధనము కాగోరు మూఢుడు - ఇన్ని
నాళ్లకు తటస్థించెను!"



హిరణ్యగర్భుని క్రోధ గర్జనకు
తుళ్లి ఎగిరినవి సభలో పక్షులు.
గజగజ వణకిన వొక క్షణకాలం.



హిరణ్యగర్భుని ఆదరభావము
సంపాదించుటకిదియే అదనని
తన మది తలచిన నీలవర్ణుడూ



దిగ్గున లేచి కపటు కోపమున - రుసరుసలాడుచు
ఇట్లనెను:- "ఈ శుకాధముడు దేవరవారినే -
అవమానించే పలుకులు పలికెను. - తమ సెలవై
నచో ఈక్షణమే అతని - తుత్తునియలుగా
నరికెదను."



"ఆగుమాగుమో నీలవర్ణుడా!
దౌత్యము నెరపగ వచ్చిన వానిని
సంహరించుటది పాడియా? నాకో,
తగిన విధముగా సమాధానమును
దేవరవారే చెప్పి పంపెదరు!"



(మంత్రి : రాజుతో)
"తాము చెప్పినది విని పోవుటకై
ఈ శుకవర్ణుడు నిలుచున్నాడు.
త్వరగా అతని పంపుట
మంచిది."



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త:- విశ్వాత్ముల నరసింహమూర్తి










హిరణ్యగర్భుని రాజ్యం వదలి- అరుణముఖుడు కతిపయ దినములలో- జంబూద్వీపం చేరాడు. వెంటనే ప్రభువుని దర్శించాడు






















మంత్రి మాటలకు సంతుష్టుండై- నెమలిరాజు తన సేనలనన్నిటి- ఆయత్తం కావించాడు.- కర్పూర ద్వీపాభిముఖుండై- ప్రయాణమొనర్చి, చేరువలోగల- గిరిశిఖరంపై విడిశాడు.




# చందమామ

మూలం: టాగూరు  అనుసరణ: "హర"

"చల్లనైన రాత్రివేళ
సన్నజాజి గుబురుల్లో
చందమామ చిక్కుకుంటె
చప్పుడు గాకుండ మనం.
గప్పున అక్కడికెళ్లీ.
చిన్నబుట్టలో వేసుక
మెల్లగ యింటికి వద్దాం;
వస్తావా నాతోడుగ,
అన్నా! నా చిన్నన్నా!"

*        *        *

"ఎంత వెర్రివాడవురా!
చందమామ మనచేతికి
అందుటకది బొమ్మకాదు.
సన్నజాజిగుబురుల్లో
అవతలనుంచగు పడినా,
అందరాని దూరంలో
చందమామ వున్నాడు.
పొందలే మతన్ని మనం,
మానివేయి నీయత్నం!"

*        *        *

"తెలివి తక్కువన్నయ్యా!
తెలియదోయి ఈ మాత్రం?
సాయంత్రం మనతోటలో
ఆటలాడు కుంటుంటే
అమ్మమనను చూడగోరి,
కిటికీ అవతలనుంచీ
తొంగితొంగి చూస్తుంటే,
అమ్మమనకు అందరాని,
దూరంలో వున్నదనే,
అంటావా అన్నయ్యా?
అమ్మ నెప్పుడాపై మరి
అందలేము అంటావా?
అన్నా! నా చిన్నన్నా!"

*        *

"ఎంత వెర్రివాడవురా,
ఎంత తెలివి తక్కువరా?
చందమామ మనకు అసలు
అందదనీ తెలుసుకోర!
చందమామవద్ద కెగిరి
దగ్గరలో నిలబడితే
చెప్పలేని అంత గొప్ప
గోళంగా కన్పడురా!
అంత పెద్ద గోళాన్నీ,
ఇంత చిన్నవాడ వీవు,
ఎట్లు పట్టి ఆడగలవు?
తెలుపవోయి తమ్ముడా!"

*        *        *

"అన్నా, అన్నా, అయితే,
అమ్మ మనను ఎల్లప్పుడు,
ముద్దు పెట్టుకొనేందుకై
వంగి ఎత్తుకున్నప్పుడు,
అమ్మ ముఖం అసలుకంటె,
పెద్దదిగా కన్పడునా?
మీ పంతులు మీకు చెప్ప
బూటకాలు యింతేనా?
తెలియజెప్ప అన్నయ్యా.
తెలివిలేని అన్నయ్యా!

*        *

అందుకనే నేనిప్పుడు,
చందమామ నందుకొని,
ఆడుకొనగ పోతున్నా;
వస్తే రా, పోతే పో,
ఓ అన్నా! చిన్నన్నా!"



బొమ్మరిల్లు సీరియల్

అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

(గత సంచిక తరువాయి)

మధ్యాహ్నం భోజనాలు అయ్యాక, జార్జి, గోనెసంచిలో నుంచి బాంజో పైకితీశాడు. కాసేపు వాయిస్తానన్నాడు: హారిస్సు అందుకు అభ్యంతర పెట్టాడు. తనకి అసలే తలనొప్పిగా వుందనీ, వీడి సంగీతం వింటే యింకా ఎక్కువై పోతుందనీ అడ్డు పెట్టాడు. ఎంత తలనొప్పిగావున్న వాడికైనా, సంగీతం వింటే పోతుందనీ, ఒక్కసారి వినిచూస్తే అది వీడికే బోధపడుతుందనీ అంటూ, జార్జి బాంజోమీద రెండు మూడుసార్లు 'టుయ్ టుయ్' మనిపించాడు.

'సంగీతమూ వద్దు: చట్టుబండలూ వద్దు! ఈ తలనొప్పితో నన్నిలా ఏడవనివ్వ'మని హారిస్సు ఒకటే గోల. నిజానికి జార్జికి బాంజోవాయించటం యిప్పటికీ రాదు. పాపం—వాడు ఎన్నిసార్లో నేర్చుకొందామని ప్రయత్నించాడు: ఎన్నిసార్లు ప్రయత్నించినా, ప్రతి సారీ ఎవరో ఒకరు యిలా వాడికి అడ్డం తగలటం తప్పలేదు. మా పడవప్రయాణం సందర్భంలోనే రెండుమూడుసార్లు బాంజో పైకితీశాడు, కొంచెమైనా సాధకం చేద్దామని. కాని ఎప్పుడూ కొనసాగలేదు. అసలు జార్జి పూర్తిగా నీరు కారిపోవటానికి హారిస్సు అడ్డగోలు ధోరణేచాలు: వాడికి మాంటీ మొరన్సీ తోడయ్యేది. జార్జి, బాంజో పైకి తీసింది మొదలు, మళ్లీ వాడు వాయించటం ఆపేసేదాకా, అల్లా వాడికి ఎదురుగుండా కూర్చొని ఆపకుండా మొరుగుతునేవుండేది. పాపం- వాడికెప్పుడూ ఓసరం తైనా అవకాశం యిచ్చేదికాదు. దాంతో జార్జికి వొళ్లు మండుకొచ్చి, కాలిబూటు వూడదీసి "దిక్కుమాలిన కుక్క, ఎందుకలా అరుస్తావ్?" అంటూ దానిమీదికి విసరబోయేవాడు.

"అది అరవదలుచుకొన్నప్పుడు నువ్వెందుకల్లా వాయిస్తావ్?" అంటూ హారిస్సు జార్జి మీదపడి వాడి చేతుల్లో బూటు లాగేసుకొనేవాడు. "కాసేపు దాన్ని విశ్రాంతిగా అరుచుకోనియ్యవుకదా? అరవకుండా అది వుండలేదు!" అంటూ హారిస్సు కుక్క తరఫున వాదించేవాడు. ఈపోరు పడలేక జార్జి తన సాధకం కట్టిపెట్టేశాడు. ఇంటికెళ్లాక హాయిగా ఎవరి అడ్డమూ వుండదుకదా, అక్కడసాధకం చేద్దామని ఆశపడ్డాడు. కాని అక్కడా సాగలేదు. వీడు యిలా బాంజో తీసీ తియ్యకముందే వాళ్ల యింటియజమానురాలు వచ్చి తలుపుకొట్టేది. తనకైతే వీడి యీసంగీతం వినటం చాలా యిష్టమే అయినప్పటికీ, మేడమీదిభాగంలో అద్దెకున్న ఆవిడకి ఆరోగ్యం సరిగాలేదని, ఆవిడ యిప్పుడున్న పరిస్థితుల్లో మనస్సుని కలతపరిచే శబ్దాలు ఏవైనా వింటే ప్రమాదమని వైద్యుడు నాటిపుదయమే హెచ్చరికచేసి వెళ్లాడనీ, అంచేత వీడి సంగీతపాఠాలు కాస్సేపు కట్టిపెట్టమని బ్రతిమలాడేది. ఇల్లాకాదని


మూలం:
జెరోమ్ కె. జెరోమ్

★

అనువాదం:
విశ్వాత్ముల నరసింహమూర్తి



# ముచ్చటగా ముగ్గురు



జార్జి, బాంజో పట్టుకొని అర్ధరాత్రప్పుడు చౌకులో కూచుని వాయించటం మొదలుపెట్టాడు. ఒకటి రెండు రోజులు గడిచేసరికి చుట్టుపక్కల కొట్లవాళ్లూ, యిళ్లవాళ్లూ పోలీసులకి ఫిర్యాదుచేశారు. వీడికోసం పోలీసులు ఒకరోజు రాత్రి నిఘావేసి పట్టుకొన్నారు. చిక్కుమాలిన బాంజో మారణాయుధంలాగా ఆసమయానికి వాడిచేతిలోనే వున్నందువల్ల వాడికి వాదించటానికి వీల్లేకపోయింది. అప్పటినుంచీ ఆరునెలల దాకా, ఆచుట్టుపట్ల ఎక్కడైనా బాంజోవాయించినట్లు వినిపిస్తే వీణ్ణి జైల్లో పెట్టేస్తామని కోర్టువారు గట్టిగా హెచ్చరించి అప్పటికి వదిలేశారు.

దాంతో వాడికి పూర్తిగా నిస్పృహ వచ్చేసింది. అయినప్పటికీ ఆరు నెలల గడువు తీరాక ఒకటిరెండు సార్లు వ్యర్థ ప్రయత్నాలు చేశాడు. అప్పుడూ అదే గొడవ! సన్నిహితులైన వాళ్లే వాడికి సానుభూతి చూపలేకపోతే, చుట్టూ వుండే ప్రపంచం అంతా వాడిని చిన్న చూపు చూసిందంటే అందులో ఆశ్చర్యం ఏముందీ?—చివరికి ప్రాణం విసిగి పత్రికలలో ప్రకటనలు వేసి, దాన్ని అమ్మేశాడు. కాలక్షేపానికి పేక ముక్కలతో మాజిక్ చెయ్యటం నేర్చుకొన్నాడు.

అసలు ఏ సంగీత వాద్య విశేషమైనా వాయించటం నేర్చుకోవాలనుకొంటే ఎన్ని గొడవలు! ఏదో యీ విద్య నేర్చుకొని సంఘానికి యింత సేవచేద్దాంకదా అని మనమనుకొంటే, సంఘం అణుమాత్రమైనా ఆలోచించకుండా మన పట్ల చాలా నిర్దయగా ప్రవర్తిస్తుంది. ఎవరైనా నేర్చుకొనే దాకా కొంచెం ఓపికపట్టి ఆగగలిగితే, వాళ్ళలో నుంచే ఎంత మహా విద్వాంసులు తయారౌతారో అని అయినా యీ సంఘం ఆలోచించదు.

ఇదివరకు నాకు తెలిసిన వాడొకడు యిలాగే చాలా సరదాపడి సన్నాయి మొదలుపెట్టాడు. చెప్తే నమ్ముతారో నమ్మరో కాని,— అందు మూలంగా వాడికి ఎన్నిరకాలైన యిబ్బందులు వచ్చాయనుకొన్నారు? వాళ్ళ సంగతి, వీళ్ల సంగతి దాకా ఎందుకు?— వాడి స్వంత తల్లీ తండ్రీ అక్కా చెల్లెళ్లు, అన్నా తమ్ముళ్లు వాడిని ఎన్ని రకాల నిరుత్సాహపరచాలో అన్ని రకాలా నిరుత్సాహ పరిచారు. వాళ్ళ నాన్నకైతే, వీడు సన్నాయి నేర్చుకుంటానన్న రోజు నుంచీ వొళ్లుమంటే! ఆ వూసువచ్చినప్పుడల్లా ఆకాశమంత ఎత్తున ఎగిరి పడేవాడు.

ఇంట్లో ఎంత అడ్డు పెట్టుతున్నా మా మిత్రుడు మాత్రం ప్రతిరోజూ తెల్లవారుఝామునే లేచి సాధకం మొదలు పెట్టాడు. అందుకు వాళ్ల అక్కయ్య గట్టిగా అడ్డు తగిలింది. ఆవిడకు దేవుడూ దెయ్యం అంటే భక్తి విశ్వాసం మెండు. అంచేత పొద్దున నిద్దర లేస్తూనే ఈ అపశ్రుతులు వినటం మంచిది కాదని ఆవిడ అభిప్రాయం. పోనీకదా అని, వీడు రాత్రిపూట యింట్లో వాళ్ళందరూ భోజనాలు చేసి పడుకొన్న తరువాత సాధకం మొదలు పెట్టి చూశాడు. పొద్దుపోయి కొంపకిచేరే బాటసాగులందరూ, వీడు చేసే యీ చప్పుళ్ళకి వాళ్ళ యింటి చుట్టూ మూగిపోయేవాళ్లు. మరునాటి వుదయానికల్లా, వీళ్ళయింట్లో అతి భయంకరమైన హత్య ఏదో జరిగిందని, కత్తిదెబ్బ తిన్నమనిషి ఎవడో వీళ్ల యింట్లో నుంచీ 'కీ...కిచ్‌క్'మని అరచి ఆవలించి చావటం తాము చెవులారా విన్నామనీ వూరంతా చెప్పుకోవటం మొదలు పెట్టేవారు.

అపవాదులు భరించలేక వాళ్లయింట్లో వాళ్లంతాకలిసి వాణ్ణిబతిమాలి రాత్రిపూట సాధకం మానిపించి, ఆసాధకం ఏదో పట్టపగలే వంటింటి వెనగ్గా వున్న చీకటికొట్లో చేసుకోమన్నారు. ఎక్కడో ఒకమూలగా చీకటికొట్టులో కూర్చుని వాయించినా వీడి సన్నాయి నొక్కులు విధివాకిట్లో తూరుపుగదిలో కూచున్న వాళ్లమ్మకి స్పష్టంగా వినిపిస్తుండేవి. ఆవిడకి వాడంటే వల్లమాలిన వాత్సల్యం వుండటంచేత ఆ ధ్వనులన్నీ ఆవిడ చెవులకి వినసొంపుగా వుండేవి. సొంపుగా వుండటమే కాదు, సన్నాయి నొక్కులు వింటున్నంతసేపూ ఆవిడ కెందుకనో, వెనక ఎన్నడో సొరచేప నోట్లోపడి చచ్చిపోయిన వాళ్లనాన్న సంగతి జ్ఞాపకానికి వచ్చి, వెక్కి వెక్కి ఏడ్చేది.

ఇక యిల్లా లాభంలేదని యింటికి రెండుఫర్లాంగుల దూరంలో ఒకతోటవుంటే అందులో కూర్చొని

పీణ్ణి సాధకం చేసుకోమన్నారు. ప్రతిరోజూ వాడు వాయిద్యాన్ని కూడా పట్టుకెళ్లి, తోటలో కూర్చుని తెగసాధకం చేసేవాడు. కాని వాళ్ల యింటికి ఎవరైనా కొత్తగా చుట్టం అంటూ వచ్చాడంటే ఎక్కడలేని చిక్కూవచ్చి పడేది. ఇంటికివచ్చిన చుట్టం ఏమికావాలోనని అటూయిటూ తిరుగుతూ, యీతోట దగ్గిరకి వస్తాడనుకోండి. ఆ పెద్దమనిషి గనక కొంచెం గుండె దిటవుగలవ్యక్తి అయితే, కొద్దిగా మూర్ఛవచ్చేది. సాదారకంమనిషి అయితేమాత్రం పిచ్చెక్కేది. ఏమైనప్పటికీ — కొత్తగా సన్నాయి నేర్చుకొనేవాళ్లు ఎన్ని బాధలో పడక తప్పదు. మా మిత్రుడుపడ్డ బాధలన్ని చూశాక, నేను సన్నాయిజోలికి పోవటం మానుకున్నాను. సన్నాయి వాయించేవాడికి చాలా దమ్ములుండాలి. స్వరం అంతా వెయ్యటానికి ఎంతగాలి కావాలో అంతా, ముందుగానే వూపిరితిత్తుల్లోకి పీల్చుకోవాలి. ఈ అభిప్రాయం ఎంతవరకు నిజమో నాకైతే తెలియదుకాని, నా మిత్రుడు పడుతున్న పాట్లన్నీ చూసిన మీదట ఏర్పరచుకొన్న అభిప్రాయం కాబట్టి, యిందులో కొంతైనా నిజం వుండవచ్చు.

వాడు ఏంచేసే వాడంటే— స్వరం ఎత్తుకోవడం ఎత్తుకోవటం, వుదాత్తమైన స్థాయిలో ఎత్తుకొని చివరికొచ్చేసరికి సన్నగా గొణుగుతున్నట్లు 'కుయ్... కుయ్...' మనిపించేవాడు.

ఒక్కముక్కలో చెప్పాలంటే - సన్నాయి వాయించే వాడు మాంచి బలంగా వుండాలి.

మా మిత్రుడు మొత్తానికి కష్టపడి కష్టపడి చివరికి ఒక్కటంటే ఒక్కటేపాట వాయించటం నేర్చుకొన్నాడు: కనీసం నేర్చుకొన్నానని అనుకొనేవాడు. ఇంటికి ఎవరువచ్చినా వాళ్లకి ఆపాట వినిపించేవాడు. అదేమి ఖర్మమో - వాయించినవాడు ఒకపాట అనుకొని వాయిస్తే, వినేవాళ్లకి అది యింకేదో పాటలా వినిపించేది - మొత్తానికి అదేదో (స్కాచ్) సంగీతం అనిపించేది.

హారిస్సుకి వొంట్లో బాగులేదు. మధ్యాహ్నం మేము వండిన 'ఐరిష్ పులుసు' వాడి తత్వానికి పడలేదు కాబోలు. గొప్పగొప్ప వంటకాలుతింటే వాడికి యిలాగే తత్వం ఫిరాయిస్తూ వుంటుంది - అలవాటులేక! అంచేత వాడిని బోటులోనే పడుకోమని నేనూ, జార్జి, అలా 'హెన్లీ' గ్రామం చూసి రావటానికి వెళ్దామన్నాం. హారిస్సు సరేనన్నాడు. తాను ఆ పూటకి గుక్కెడు సారామాత్రం తాగి పడుకొంటాననీ, పడుకోబోయే ముందు పడవలో సామానుఅంతా సర్దేసి మా పక్కలుకూడా వేసి సిద్ధంగా పెట్టుతాననీ చెప్పాడు. ఊరంతాచూసి ఒడ్డుమీదికి వచ్చి ఒక్క కేకవేస్తేచాలు తను పడవని ఒడ్డుదాకా నడిపించుకు వస్తానన్నాడు.

"మొద్దునిద్ర మాత్రం పోకురోయ్!" అంటూ వాణ్ణి హెచ్చరించి మరీ కదిలాం, మేమిద్దరమూ.

"ఆఁ! ఎక్కడనిద్ర లేరా? ఈ దిక్కుమాలిన పులుసు నన్ను నిద్రకూడా పోనిస్తుందా?" అన్నాడు హారిస్సు బాధగా నవ్వుతూ.

'హెన్లీ' గ్రామంలో కొద్దిరోజుల్లో ఏదో తిరణాల లాంటిది జరగబోతున్నది. ఊరంతా హడావుడిగా వుంది. తిరణాలకోసం వచ్చిన జనసందోహంలో మాకు తెలిసినవాళ్లు ఐదారుగురు కనిపించారు. వాళ్లతో పిచ్చాపాటీ మాట్లాడుతూవుంటే, టైం యిట్టే గడిచిపోయింది. ఊరువదిలి మేము రేవుకి బయలుదేరేసరికి రాత్రి పదకొండు దాటింది. ఊరికీ రేవుకీ నాలుగుమైళ్ల దూరం.

పైన సన్నని చినుకు. ఈదురుగాలి: - యీ చెవిలోనుంచి ఆ చెవిలోకి కొట్టుతున్నది. గాఢాంధకారం. పొలాల్లోనుంచీ పుంతల్లోనుంచీ పడిరావటమేమో—మా యిద్దరికీ ఎప్పుడెప్పుడు పడవలో వచ్చి పడతామా అనివుంది. పడవలో హాయిగా ముడుచుకు పడుకొన్న హారిస్సూ, మాంటీ మొరస్నీ, వీళ్లవిషయం జ్ఞాపకంవచ్చి, యీర్ష్యపడ్డాం.

నడవగా నడవగా, పడవలరేవు పొడగట్టింది. దాంతో మాకు పెద్దధైర్యం వచ్చింది— యింతవరకు సరైనబాటనే వచ్చామని. లేకపోతే ఏముంది?— చచ్చిచెడి అంతదూరం వానకి తడుస్తూ నడిచివచ్చాక, మనం వచ్చింది తప్పుడుతోవని తేలిందనుకోండి: ఎంత చిరాకు వేస్తుంది? ఒక చెంపని యిద్దరికీ నిద్రతో కళ్లు మూరుకు పోతున్నాయి. రేవుదగ్గరికి వచ్చేసరికి

(42-వ పేజీ చూడండి)

# జున్ను దొంగ

మా ప్రసాదు ఒట్టి చిలిపివాడు. వాడు చేయని అల్లరి అంటూ లేదు. అయిదోఏడు వచ్చింది. అల్లరి మాత్రం ఏమీ తగ్గలేదు,

వాడికి జున్ను అంటే తగని యిష్టం. కనీసం విరుగుడు పాలన్నాగూడా వాడికి చాలాయిష్టం. రోజూ ప్రొద్దున్నా సాయంత్రం మాఅమ్మ పాలు కాచి చల్లార్చి కాస్త పంచదారవేసి నాకూ వాడికి యిస్తుంది. ఒకరోజున వాడు అమ్మని యిట్లా అడిగాడు. "అమ్మా అందరూ పాలలో పంచదార, మజ్జిగలో ఉప్పు వేసుకుంటారు. ఎందుకని? పాలల్లో ఉప్పు, మజ్జిగలో పంచదార ఎందుకు వేసుకు త్రాగకూడదు?"

"పాలలో ఉప్పువేస్తే విరిగిపోతాయి. మజ్జిగలో పంచదార వేసుకుంటే జబ్బుచేస్తుంది" అని అమ్మ చెప్పింది.

కొన్ని రోజులకి ఒకనాడు మా ప్రసాదుపంటపండింది. ఆరోజున మా అమ్మమ్మ జున్ను పాలు తీసుకువచ్చింది. మావాడు జున్ను కావలసినంత తిన్నాడు. ఆరోజు వాడికి కొండెక్కినంత పనయింది.

మర్నాడుగూడా వాడికి జున్ను తినాలనిపించింది. అమ్మని జున్ను పెట్టమని అడిగాడు.

"ఇప్పుడెక్కడనించి వస్తుందిరా వెధవా" అని అమ్మ చివాట్లు పెట్టింది.

పాపం బిక్కమొగంపెట్టి వెళ్లిపోయి దీర్ఘంగా ఆలోచించాడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. "జున్ను ఎట్లాగో సంపాదించలేం కాబట్టి పాలలో కాస్త ఉప్పురాయి వేస్తే చప్పగా విరిగిపోతాయి. ఆ విరిగినపాలలో కాస్త బెల్లంగడ్డ వేసుకుంటే చక్కగా జున్ను తిన్నట్లే ఉంటుంది."

పి. ప్రేమకుమారి

మా అమ్మ ప్రతిరోజూ మధ్యాహ్నంపూట పొయ్యిమీద పాలు పెట్టి నిద్రపోతూ ఉంటుంది. అమ్మ లేచిన తర్వాత ఆ పాలలో కాసిని కాఫీకి కలిపి మిగిలిన పాలు తోడు పెడుతుంది. అందువల్ల మావాడికి చక్కటి అవకాశం దొరికింది, జున్ను తినటానికి.

మధ్యాహ్నం అమ్మ నిద్రపోతుంటే, నెమ్మదిగావెళ్ళి కాస్తఉప్పు తీసుకొని చల్లగా ఆ కాగే పాల కుండలోవేసి, మెల్లగా యింట్లోకి వెళ్ళి ఏమీఎరుగనివాడిలా పడుకున్నాడు.

అమ్మ లేచిన తర్వాత కాఫీలో పాలు కలుపుదామని పాలు చూచేటప్పటికి విరిగి గడ్డలయిపోయి ఉన్నాయి. ఏమిటా ఈరోజుపాలు కాస్తా విరిగిపోయాయని ఆలోచించి, అందులో కాస్త బెల్లంవేసి "ఒరే ప్రసాదూ!నిన్న జున్ను కావాలన్నావుకదూ! అందుకని నీకోసం తెప్పించాను" అని నవ్వుతూ వాడికి కాస్త పెట్టింది. ఇలా జరుగుతుందని వాడికిముందే తెలుసు. సంతోషంతో హాయిగా ఆబెల్లం కలిపిన కాస్త విరుగుడూ నోట్లో వేసుకున్నాడు. ఇక ఆ రోజునుండి చూడండి! మా యింట్లో పాలు విరగని రోజంటూ లేదు. మావాడు విరుగుడుతినని రోజంటూ లేదు.

మా అమ్మకూ నాన్నకూ ఇదో పెద్ద సమస్య అయిపోయింది. "ఎందుకీ పాలు విరిగిపోతున్నాయి?" అని వారు ప్రతి వాళ్ళను అడిగిచూచేరు. కాని ఎవరూ దానికితగిన, సమాధానమివ్వలేదు. చివరకు అమ్మ ఒక సోదిఅమ్మిని పిలిచి సోది అడిగింది. ఆ అమ్మి సోదిలోకి మా నాయనమ్మ వచ్చినట్లూ, ఆమె పేరుతో ముత్తయిదువకు, చీరె, రెవికలగుడ్డ, పసుపు,కుంకుమ, యిచ్చి పెట్టుకుంటే పాలు విరగటం మానుతుందనీ చెప్పింది. అలా చేయకపోతే యింకా విపత్తులు కూడా వస్తాయని చెప్పింది. ఇక మా అమ్మ ఆగకుండా నాన్నగారిని వేధించి చీరె, రెవికలగుడ్డా తెప్పించి మా పిన్నిని పిల్చి ముత్తయిదువకు పెట్టుకొని అవి యిచ్చింది.

ముత్తయిదువకు చీరె, రవికల గుడ్డ, ముట్టినప్పటికీ పాలు విరగడం మాత్రం మానలేదు. మా నాన్న గారు మాత్రం "ఈ కరువురోజుల్లో ముత్తయిదువ కంటూ పదిరూపాయలు వదిలించావు" అని విసుక్కున్నారు మా అమ్మమీద.

తరువాత కొన్ని రోజులకు మా అమ్మమ్మ వచ్చింది. అమ్మ, అమ్మమ్మతో యిలా పాలు రోజూ విరిగిపోతున్నాయని చెప్పగానే, "అదేముందే! గంగానమ్మకు చద్ది నైవేద్యం పెట్టుకుంటే, పాలు విరిగిపోవటం టకీ మనికట్టిపోతుంది" అని చెప్పింది.

మా అమ్మ చాలా శ్రద్ధగా గంగానమ్మతల్లికి పూజచేసి చద్ది నైవేద్యం పెట్టింది. కాని పాలు మాత్రం విరగటం మానలేదు. చల్లనితల్లి గంగానమ్మకూడా పాలు విరిగిపోవడం మాన్పలేక పోయింది.

ఇట్లా కొన్నిరోజులు జరిగాయి. ఒకరోజు మా ప్రసాదు పాలలో ఉప్పువేయటంకోసం వెళ్ళడం మా చిన్న చెల్లాయి వనజ చూసింది. దానికి మూడేళ్ళు. దానికి మీగడఅంటే చాలా యిష్టం. వాడు దొంగతనంగా మీగడ తిని వెళ్ళిపోతున్నాడేమోననే ఉద్దేశ్యంతో, తాను వెళ్ళి మీగడ తీద్దామని ఆ కాగుతున్న పాలల్లో చెయ్యిపెట్టింది. చెయ్యి పాలల్లో పెట్టీ పెట్టడంతోనే చుర్రుమని కాలింది. 'చుర్రు' మనగానే "అమ్మో" అంటూ కేకపెట్టి ఏడవడం మొదలుపెట్టింది. ఇంతలో అమ్మా, నాన్నా పరుగెత్తుతూ వచ్చి చూసేటప్పటికి, దానిచెయ్యి కాస్తా ఎర్రగా కాలివుంది. అది చెయ్యి విదిలించుకొంటూ ఏడుస్తోంది. దానిచెయ్యికి మందురాసి "పాలల్లో ఎందుకు చేతులు పెట్టావే" అని అడిగిందిఅమ్మ.



అమ్మ లేచిన తర్వాత కాఫీలో పాలు కలుపుదామని పాలు చూచేటప్పటికి అవి విరిగి గడ్డలయి పోయిఉన్నాయి.

"అన్నయ్య మీగడ తినటానికి వెళ్ళి తీసుకుని వెళ్ళిపోయాడు, అందుకని నేనుకూడా తిందామని చెయ్యి పెట్టేటప్పటికి చుర్రుమని కాలింది" అని చెప్పింది ఏడుస్తూ.

అప్పుడు అమ్మ చూచేటప్పటికి పాలు విరిగి గడ్డలయిఉన్నాయి. అప్పుడు మా ప్రసాదును పిలిచి "ఏమిచేశావురా పాలల్లో" అని అడిగింది మా అమ్మ. బిక్కముగంపెట్టి వాడు జరిగిందంతా అమ్మకు చెప్పాడు. అలాఎప్పుడూ చేయకూడదని నాలుగు చివాట్లు పెట్టి ఊరుకున్నారు.

ఆ రోజున మా అమ్మ నాన్నా, "పాపకు చేయికాలితే కాలింది కాని గంగానమ్మ తల్లికూడా పట్టుకోలేని విరుగుడుపాల దొంగను మాత్రం అయిదు నిముషాల్లో పట్టుకుంది" అని నవ్వుకున్నారు.

ఆ రోజునుంచి ఎప్పుడయినా పాలు నిజంగా విరగాల్సి విరిగిపోయినా కూడా, పాపం మా ప్రసాద్ ఏదోచేసి విరుగకొట్టాడని అనేవారు. ★

# అభ్యర్థన

సేఠ్ మంచాలాల్ ఆ ఊళ్లో ఒకే ఒక లక్షాధికారి. గొప్ప వ్యాపారస్థుడు. తలనెరిసిన ధనికుడు! ఒకసారి అతడు తన ఆఫీసులో కూర్చుని ఉండగా ఒక యువకుడు వచ్చాడు. ఏవేవో విషయాలు వ్యాపారరీత్యా అడిగి, చాలసేపు మాట్లాడి ఒకపుస్తకంలో వ్రాసుకొని ఆ యువకుడు చక్కా పోయాడు...

మర్నాడు సాయంకాలం సేఠ్ గారు ఆఫీసునుండి షికారు బయల్దేర బోతూవుండగా, నిన్నటి యువకుడే మళ్లీవచ్చాడు. అతని చేతిలో ఒక పటంకూడా ఉంది. నిన్న నే ఆ యువకుడు సేఠ్ గారికి చాల చీకాకు కల్గించిఉన్నాడు. తిరిగి ఇవ్వేళా శనిలా పట్టుకొన్నాడని మంచాలాల్‌జీ తప్పించుకో బోయారు, కాని యువకుడు వదిలి పెట్టలేదు. "నేనొక చిత్రకారుణ్ని. నిన్న మీ ఆఫీసుకువచ్చి అడిగినది వ్యాపారవిషయాలే అయినా, వ్రాసుకొన్నది మీ రూపాన్ని. చూస్తారా?" అంటూ చేతిలోని పటం చూపించాడు. ఆశ్చర్యం! అచ్చుగుద్దినట్లు సేఠ్‌జీ ఆపటంలో కన్పించుతున్నారు. ఆఫీసులోనివారంతాకూడా వింతపడి ఆ యువకుని కళానైపుణ్యానికి మెచ్చుకోసాగారు. కాని సేఠ్‌జీ వక్రపుచూపులు గమనించి, ఎవరికి వారు చల్లగా జారుకొన్నారు. అప్పుడు మంచాలాల్ "ఇంతకీ ఏమంటావ్?" అనడిగాడా యువకుణ్ని.

చిరునవ్వుతో, వినయంగా "నాకో అయిదువందలు అవసరం! మీరా చిత్రపటాన్ని పుచ్చుకొని సంతోషంతో నా అవసరం తీరిస్తే, ఎంతో ఆనందిస్తాను." అన్నాడా యువకుడు.

"ఏమిటీ? అయిదువందలా? ఇందులో నారూపురేఖలు నాశనమైనాయి. ఇంతకన్నా అద్భుతమైన ఆయిల్ పెయింటింగులు యిచ్చిన పెద్దపెద్ద కళాకారులకే నేనెప్పుడూ అంత ఖరీదు ఇవ్వలేదే!" అన్నాడు సేఠ్.

"కళకు ఖరీదు లేదంటోయ్!" అన్నాడు యువకుడు.

సేఠ్ ముఖం చిట్లించుకొని, "అయినా, నేనేం కోరనేలేదు. నీకునీవే ఈ పని చేసుకొచ్చావు. పోతే, నారూపమూ చెడగొట్టావ్. ఏదో కుర్రాడివి. చురుకైనవాడివి. కావాలంటే ఓ పది రూపాయలు సాయం చేయగలను. ఏం?" అన్నాడు.

మనస్సులో సేఠ్ సంతృప్తి పడినా లోభియై నాటకమాడుతున్నాడని చిత్రకారుడు విశ్వం గ్రహించకపోలేదు. అమాయకుడు కనుక సేఠ్ మాటలకు బాధపడి "నాకక్కర్లేదు. ఈ పటంకూడా మీ వద్దనే ఉంచుకోండి. అదే పదివేలు నాకు." అని తిరిగి జవాబైనా వినకుండా తలొంచుకొని వెళ్లిపోయాడు విశ్వం. వచ్చిందే చాలని మంచాలాల్ అందమైన తన రూపచిత్రాన్ని భద్రపరచుకొన్నాడు...

విశ్వానికి స్నేహితుడు విజ్ఞాని. అసలు పేరేమో ఎవరికీ తెలియదు కాని, విజ్ఞానిగానే ప్రచారంలో ఉన్నాడు. అతనికి ఈ సంగతంతా తెల్సింది. నవ్వి, విశ్వంవీపు చరిచి "వెర్రివాడవోయ్ మిత్రమా!" అన్నాడు. బాధలోవున్న విశ్వానికి అతనిమాట లేం అర్థంకాలేదు. "చూడు నా తమాషా!" అంటూ విజ్ఞాని విశ్వం వ్రాసిన చిత్రాలలో ధనలక్ష్మి వర్ణచిత్రం ఒకటి చేతబట్టుకొని బయల్దేరాడు...

సేఠ్ మంచాలాల్‌జీ ఉదయమే ఇంటినుండి బజారుకని బయల్దేర బోతుండగా విజ్ఞాని ఎదురయ్యాడు

"నమస్కారం సేఠ్‌జీ" అన్నాడు.

"ఎవరది?"

"దయచేసి ఇది చూడాలని నా ప్రార్థన" అంటూ చేతిలోని ధనలక్ష్మి పటాన్ని అందించాడు.

మంచాలాల్ అది పుచ్చుకొని పరీక్షిస్తుండగా,

"నేనొక బీద చిత్రకారుణ్ణి. తమరు గొప్ప కళాపోషకులని తెలిసి తమ దర్శనం కోసం వచ్చాను. నాదారిద్ర్యం మీ దర్శనంతోనే తొలగిపోయింది" అని బాతాఖానీ ప్రారంభించాడు విజ్ఞాని.

"ఏమంటావింతకీ?" అని అడిగాడు మంచాలాల్.

"ధనలక్ష్మిని మీ యింట్లో అలంకరించుకొని ఒక వెయ్యి రూపాయలిప్పించండి!"

"ఆఁ! ఈ బొమ్మకి వెయ్యా? పిచ్చాడిలా వున్నావే భాయ్!" అన్నాడశ్చర్యంతో సేఠ్.

"అదేమిటండీ— మీకు లక్ష్మి అక్కర్లేదా? అయితే ఇచ్చెయ్యండి. తీసుకుపోతాను" అని చేయిచాపాడు విజ్ఞాని. మంచాలాల్ బుర్ర గిర్రున తిరిగినట్లయింది.

వాళ్లు సహజంగా సనాతనులు, భక్తిపరులు కనుక, లక్ష్మిని చేజార్చుకోవడమంటే సేఠ్ దృష్టిలో పెద్ద అపశకునం; అరిష్టదాయకం! విజ్ఞాని తన చేతుల్లో ధనలక్ష్మిని ఉంచాడు. చాల మంచి శకునం అది. కాని, లక్ష్మిని తాను తన చేతుల్తో ఇంకొకరికి ఇచ్చివేయడం... గొప్ప నష్టాన్ని కల్గిస్తుందని లోలోన బాధపడసాగాడు సేఠ్ జీ!



సేఠ్ గారు ఆఫీసునుండి షికారు బయల్దేరబోతూవుండగా నిన్నటి యువకుడే మళ్లీ వచ్చాడు.

"అబ్బాయ్! నీవు అలా తొందరపడి మాట్లాడితే లాభమేమిటి చెప్పు?" అంటూ వీపు నిమురనారంభించాడు. అది పసిగట్టిన విజ్ఞాని బిర్ర బిగియసాగాడు... లక్ష్మినిచ్చివేయమంటాడు విజ్ఞాని. ధర బేరమాడ్తాడు సేఠ్. ఇలా చాలాసేపు వాళ్లిద్దరిమధ్యా మాటలు నడిచాయి! చివరికి ఏడువందల యాభై రూపాయిలు "ఉస్సురం"టూ విజ్ఞాని ఒడిలోపోసి ధనలక్ష్మిబొమ్మని ఇంట్లో, ఇనుపపెట్టిలో దాచుకోవలసివచ్చింది— పాపం, సేఠ్ గార్కి—!

గంతులేసుకొంటూ వెళ్లి విజ్ఞాని విశ్వాన్ని కల్సుకొన్నాడు.

# తైత్తిరీయ బ్రహ్మచర్యం

తిత్తిర అంటే తీతువపిట్ట అని అర్థం. ఈపక్షి రాత్రిళ్లప్పుడు కీచు కంఠంతో చంటిపిల్లలు ఏడ్చినట్లు కూస్తూవుంటుంది. ఆ కూసినప్పుడల్లా పిల్లల తల్లులు "రేపల్లె వాడలో గోపాలకృష్ణ; నీ గోళ్లు లాగ; నీ నాళ్లు నొక్క" అని తిడుతూ వుంటారు. ఆ పక్షికూత పసిపిల్లలకు ఏదో చెఱుపు చేస్తుందని మన తెలుఁగుదేశంలో ఒక విశ్వాసంవుంది. ఈ విశ్వాసానికి కారణంగా ఈ కథ చెబుతారు. కంసుడు చాల ఘాతకుడు, దేవకీదేవికిపుట్టిన పిల్లలను వరుసగా చంపడమేగాక, శ్రీ కృష్ణదేవుడుపుట్టి సుఖంగా ఇంకోచోట పెరుగుతున్నట్లు తెలిసింతర్వాత, దేశంలోని పసిపిల్లల నందరిని నిర్దాక్షిణ్యంగా చంపించాడు. ఆతర్వాత శ్రీకృష్ణుడు పెద్దవాడై, ఈ కంసుణ్ణి హతమార్చగా, వాడు పిల్లల మీద కసిదీరక, ఈ తీతువుపిట్టగా పుట్టి శిశుహృదయ భయదంగా అట్లా కూస్తూవుంటాడు:

గోవింద లూరి సాంబశివరావు

ఇట్టి విశ్వాసం మన దేశంలో ఇతర రాష్ట్రాలలో వున్నదో లేదో తెలియదుగాని తెలుగు దేశంలో మాత్రం వుంది. అయితే దీనికి కారణం ఏమిటో తెలియదు. మరి ఈ పక్షినిగూర్చి వున్న ఈ కథ ఒక్కటే బాగా ప్రచారంలోకి వచ్చిందిగాని, దీన్నిగూర్చి వున్న మంచి కథలు అంతగా ప్రచారంలోకి రాలేదు. ఉపనిషత్తులు వున్నాయా, వాటిల్లో తైత్తిరీయమని ఒక ఉపనిషత్తు వుంది అది గొప్ప ఉపనిషత్తుల్లో ఒకటి. ఈ తిత్తిరపక్షి మీదుగానే దానికి తైత్తిరీయమని పేరు వచ్చింది. ఆ రావటానికి గూడా ఒక కథ చెబుతారు. ఉపనిషత్తులను చెప్పిన ఋషులలో యాజ్ఞవల్క్యుడు అనే ఋషి చాలా గొప్పవాడు. ఈయన రాములవారి మామగారైన జనక మహారాజుకి గురువుగూడాను. ఇట్టి ఈయన తన చిన్నప్పుడు ఒక గురువు దగ్గర విద్య నేర్చుకుంటూ వుండగా ఆయనకు ఎందుకో ఈయన మీద కోపం వచ్చింది. వచ్చి నేను చెప్పిన చదువునంతా కక్కమన్నాడు. యాజ్ఞవల్క్యుడు గురువుగారి అజ్ఞమేరకు కక్కేశాడు. ఆ కక్కిన విద్యలో ఒక మహా ఉపనిషత్తువుంది. యాజ్ఞవల్క్యుడికి చాలా విచారంవేసింది. ఇంతలో అక్కడ చెట్లమీద వ్రాలివున్న తీతువుపిట్టలువచ్చి, ఈకక్కిన విద్యనంతా తిని బ్రహ్మజ్ఞానాన్ని పొందినవై, ఆ తిన్న విద్యనంతా ఉపనిషత్తుగా పాడేశాయి. అట్లా పాడిన ఆ ఉపనిషత్తుకు తైత్తిరీయమని పేరువచ్చింది.

హిందువుల్లో ఇట్లా వున్నట్లే బౌద్ధుల్లో గూడా ఈ పక్షినిగూర్చి ఒక కథవుంది, దాన్ని తిత్తిర జాతకం అంటారు. దీని పేరు మీదుగా తైత్తిరీయబ్రహ్మచర్యం అనే దీక్షగూడా బౌద్ధులలో కలసివుంది. ఆ తైత్తిరీయ బ్రహ్మచర్య ధర్మాన్ని సాక్షాత్తు బుద్ధభగవానులే ఒకరోజున తన శిష్యులకు బోధచేశాడు.

## ★ లక్ష్మీదేవి ★

అయిదువందలు స్నేహితునికి ఇచ్చి తాను రెండువందల యాభై తీసుకొన్నాడు.

"ఎక్కడిదిరా డబ్బు?" అన్నాడాశ్చర్యంగా విశ్వం. పగలబడి నవ్వుతూ విజ్ఞాని జరిగిన సంగతంతా మిత్రునికి వివరించి చెప్పాడు. "చూచావా నా తమాషా, కాదు, తడాఖా!" అన్నాడు. విశ్వం లోకంతీరుకు విస్మయమందాడు. అవసరానికి ఆదుకొన్న విజ్ఞానాన్ని ప్రేమతో కౌగలించుకొని, మురిసిపోయాడు...

★

## 2

ఈ ధర్మాన్ని బోధించిన రోజుల్లో బుద్ధభగవానుడు వైశాలీ రాజ్యంలో ఇచ్ఛానుసారంగా విహారం చేస్తున్నాడు. ఈ విహారం చేస్తూ చేస్తూ ఆయన శ్రావస్తి నగరానికి వేంచేశాడు. భగవంతుడయిన బుద్ధుని వెనుక ఆయన నిర్మిస్తున్న బౌద్ధసంఘం గూడా కదిలి నడిచింది. సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు, ఆనందుడు, ఆదిగాగల ప్రముఖులయిన శిష్యులంతా ఆయన వెనుకనే శ్రావస్తికి బయలుదేరారు. ఆరోజుల్లో షడ్వర్గీయ భిక్షువులని ఒకరకం భిక్షువులుండేవాళ్ళు. వీరు బుద్ధుడు, ఆయన వెంట ఆఅనంతరం బుద్ధుని శిష్యులు బయలుదేరడం పసికట్టి, త్వర త్వరగా ప్రయాణాలుచేసి బుద్ధుని శిష్యులకన్నా ముందుగా శ్రావస్తికి చేరుకున్నారు. విహారాలన్నింటిని ఆక్రమించుకున్నారు. సత్రవలను కూడా మిగలనీయలేదు. శాక్య పుత్రీయులయిన భిక్షుసంఘానికి రవ్వంత చోటుకూడ మిగలకుండా, అన్నిచోట్లు ఈషడ్వర్గీయులయిన భిక్షువులతో కిటకిటలాడిపోయినవి. బౌద్ధులు పోయి మాకూడా కొంచెం చోటియ్యండయ్యా అంటే, "ఇది మా గురువుల కోసం; ఇది మా ఆచార్యుల కోసం; ఇది మా అధ్యాపకుల కోసం; ఇదిగో ఇది మా కోసం; అంటూ బిరుసుతనం గూడా చూపారు. ఇక గత్యంతరం లేకనున్నా, చేసేది లేకనున్నా, సారిపుత్రుడు ఆదిగాగల శిష్యులున్నూ, సంఘంతోవచ్చిన అందరితోగూడా బుద్ధుడు విడిసివున్న స్థలాన్ని చేరుకొని, ఏక్కడా పడుకునేందుకు చోటుదొరక్క, ఆ ప్రక్కనవున్న చెట్లక్రిందనే పడుకొని ఆ రాత్రి అంతా గడిపారు.

తెల్లవారబోతూ వుండగా భగవానుడైన బుద్ధుడు కాలకృత్యాలన్నిటిని తీర్చుకొని వచ్చి, తేరపారి చూచేసరికి ఈ భిక్షువులు, ఈచెట్ల క్రింద పడుకోవడం అంతా కనిపించింది. సారిపుత్రుడుగూడా అప్పటికే లేచి కాలకృత్యాలన్నీ తీర్చుకొని భగవానుని దర్శనం కోసం వేచివున్నాడు. భగవానుడు ఈ భిక్షువులనందరినిచూచి, దూరంగా వున్న సారిపుత్రుణ్ణి, ఆ కనుచూపు చీకటిలో గుర్తుపట్టలేక "ఎవరు అక్కడ?" అని అడిగాడు.

సారిపుత్రుడు "భగవానుడా! నేను, సారిపుత్రుణ్ణి" అని భక్తిభావంతో బదులు చెప్పాడు.

"సారిపుత్రుడవా! అయితే ఇట్లు ఇక్కడ ఈ ఆరు బయట చెట్టు క్రింద కూర్చున్నావేమిటి?" అని శాక్యముని ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

ఆయుష్మంతుడయిన సారిపుత్రుడు జరిగినవృత్తాంతాన్నంతా భగవానుడికి సవిస్తరంగా వివరించి చెప్పాడు. షడ్వర్గీయ భిక్షుసంఘం గురువులు, శిష్యులు, బుద్ధ సంఘం కన్నా ముందువచ్చివిహారాన్నంతా ఆక్రమించుకొన్న సంగతి సందర్భాల నన్నింటిని భగవానుడికి తెలియజేశాడు. "సారిపుత్రుడా! నీవు చెబుతున్నది నిజమేనా?" అని శాక్య ఋషి తిరిగి అతణ్ణి ప్రశ్నించాడు. సారిపుత్రుడు "నిజము! భగవానుడా!" అని సమాధానం చెప్పాడు.

## 3.

ఇది విని బుద్ధ భగవానుడు చాలా నొచ్చుకున్నాడు. ఆయనకు ఈషడ్వర్గీయభిక్షువులు అందరిమీద కోపంవచ్చింది. సారిపుత్రునితోవచ్చిన భిక్షుసంఘంలో ఎంతోమంది వృద్ధులువున్నారు. వారంతా గూడా ఆరాత్రిఅంతా అట్లా ఆరు బయట చెట్లక్రింద, పుట్టలక్రింద పడుకోవలసి రావడంచూచి హృదయం సానుక్రోశంతో ద్రవించిపోయింది. వృద్ధభిక్షువులనుగూడా


జలుబులు, శైత్యం






జలుబులు శైత్యం దగ్గులు గొంతు పుండు. ఇన్ఫ్లుయెంజా, బ్రాంకైటిస్, ఇతర బాధలు వచ్చినప్పుడే పెప్స్‌ను సేవించండి. పెప్స్‌ను చప్పరించు నపుడు క్రిమి విధ్వంసకరమైన ఔషధసారాలు రొమ్ము, శ్వాసకోశాంతర్భాగాలలో ప్రవేశిస్తున్నట్లు మీకే తెలియును. పెప్స్ క్రిములను సంహరించి, వాపులను మాన్పి, మనను పోగొట్టి బాధోపశమనం కలిగిస్తాయి. పెప్స్‌నే వైద్యులు సిఫారసు చేస్తారు

పెప్స్ సేవించండి.

**PEPS**

క్రిమి సంహారకరమైన గొంతు, రొమ్ము టేబ్లెట్లు.



మద్రాసు సోల్ ఎజంట్లు దాదా & కంపెనీ, పార్కుటౌను, మద్రాసు-3

# ★ తైత్తిరీయ బ్రహ్మచర్యం ★

చూడక ఈ షడ్వర్గీయులు ఇట్లా చేయడం ఆయనకు కోపాన్ని తెచ్చింది. అప్పటికే భిక్షువులంతా లేచి భగవానుని చుట్టూ చేరారు. కొంతమంది షడ్వర్గీయులుగూడా ఏమిజరుగుతుందోనని చూట్టానికి వచ్చారు. భగవంతుడు భిక్షువులనందరిని సంబోధించి "ఈషడ్వర్గీయులు లాయకీలేని భిక్షువులు. వీరు బుద్ధసహితమైన భిక్షుసంఘాన్ని ఇట్లా చేస్తారా? ఇది అప్రసన్నులను ప్రసన్నులను చేసేపనిగాని, ప్రసన్నులను అధిక ప్రసన్నులను చేసేపని గానికాదే! అప్రసన్నులను మరీ అప్రసన్నులను, ప్రసన్నులయిన, శ్రద్ధాళువులయిన వారిలో గూడా కొంత మందిని, అప్రసన్నులనుగా మార్చే పనిగా వుందే? ఇదేనా భిక్షువులకు భిక్షువులుచెయ్యవలసిన మర్యాద!! అని ఉపన్యసించి, వారికి ధార్మిక కధాకధనంతో మనస్సంతోషాన్ని చేకూర్చి, ఇట్లా అన్నారు: "ప్రధమ ఆసనానికి, ప్రధమపాధేయానికి, ప్రధమ భిక్షాపిండానికి, యోగ్యులెవరు? ఈ ప్రశ్నకు బాగా ఆలోచించి సదుత్తరాన్ని ఇవ్వండి చూద్దాం."

భిక్షువులంతా ఈ ప్రశ్నకు ఏమి ప్రత్యుత్తరం చెప్పాలా అని ఆలోచనల్లో పడ్డారు. ఆసంఘంలో ప్రతిఒక్కరు గట్టిగా ఆలోచించారు. కొంతమంది భిక్షువులు ఆలోచించు, ఆలోచించి "భగవానుడా! క్షత్రియుడైయుండి, ప్రవ్రజితుడై బౌద్ధసన్యాసి అయినవాడికిముందు ఆసనం ఇవ్వాలి; ముందుపాథేయం ఇవ్వాలి; ముందు భిక్షాపిండం పెట్టాలి" అని సమాధానం చెప్పారు. కొంతమంది బౌద్ధమతాన్ని స్వీకరించి, ప్రవ్రజితుడైన బ్రాహ్మడే ఈమర్యాదలన్నీ ముందు పొందడానికి యోగ్యుడన్నారు. మరికొందరు ప్రవ్రజితుడైన వైశ్యుడు ఇందుకు అర్హుడన్నారు ఇంకా కొందరు సౌత్రాంతికులు ఇందుకు తగినవాళ్లన్నారు. కొందరు వినయధరులు ఈ మర్యాదకు యోగ్యులన్నారు. మరి కొంతమంది భిక్షువులు "భగవానుడా! ధర్మవ్యాఖ్యానం చేసే వారికి ఈమర్యాద జరగాలన్నారు. ఇంకా కొందరు భిక్షువులు మొదటిసారిగా పట్టిన ధ్యానంలోనే యోగబలాన్ని సంపాయించినవాడే ఇందుకు యోగ్యుడన్నారు. మరికొందరు త్రయీవిద్య నేరిగినవానికి ఈ మర్యాద చేయడం బాగుంటుందన్నారు. కొందరు షడాభిజ్ఞునికని, కొందరు అర్హతుడైనవానికని, కొందరు అనాగామికని, కొందరు అసకృదాగామికని, ఇట్లా సమాధానాలు చెప్పారు.

బుద్ధుడు పెదిమి విరిచాడు. ఇందులో ఏఒక్కరు చెప్పిన సమాధానంగాని ఆయనకు సరియైనదనిపించలేదు. అందువల్ల వారిని సంబోధించి, వినండి అని, ఈ తిత్తిరజాతకాన్ని చెప్పారు.

## 4

పూర్వకాలంలో హిమాలయ పర్వతాలకు సమీపంగావున్న ఒకానొక ప్రదేశంలో ఒక పెద్ద మర్రిచెట్టువుంది. ఆ మర్రిచెట్టును ఆశ్రయంగా చేసుకొని ఒక తిత్తిరము, ఒక వానరము, ఒక గజేంద్రము నివశిస్తున్నాయి. ఎంతో కాలంనుంచి అవిఅట్లా నివశిస్తున్నా, ఒకదానినొకటి గౌరవించుకొన్న పాపానగాని, సహాయం చేసుకొన్న పుణ్యానగాని, సహజీవితాన్ని గడుపుకొన్న మర్యాదనుగాని పోయిన జాడ కనుపించదు. ఇట్లా వుండగా, వుండగా, ఈ మూడింటికి ఒక రోజున ఒక ఆలోచన తట్టింది. "మేము ముగ్గురం ఇంత కాలం నుంచి ఇక్కడ వుంటున్నాం కాని మాలో జ్యేష్ఠుడెవరో తెలియకుండా వుంది. ఈజన్మలో మాముగ్గురిలో ఎవరు పెద్దో, వారికి సత్కారం చేస్తే, పూజ చేస్తే అభిమానిస్తే గౌరవం నెరపితే, మర్యాదగా వుంటుంది. ఇట్లా ఎవరికి వారికైన బ్రతుకు ఎంతకాలం గడిపేది. ఇందులో స్నేహము, గౌరవము, మర్యాద, పెద్దతనం ఏమీ లేవు అని ఆలోచనచేసి, ఆపక్షి, ఆవానరం, ఆ నాగం తమలో ఎవరు వృద్ధులో, ఎవరు జ్యేష్ఠులో అన్న విజిజ్ఞాసతో, ఆతెలుసుకొనే ప్రయత్నములో పడినాయి.

ఒకరోజున తిత్తిరము, మర్కటము కలిసి, ఏనుగు దగ్గరకు వెళ్లి "సౌమ్యుడా! నీకు జ్ఞానం వచ్చిన తర్వాతగాని, అంతకుముందుగాని, జరిగిన సంగతి ఏదన్నా జ్ఞాపకం వుంటే చెప్పు" అని అడిగాయి.

"ఓ! అందుకు అభ్యంతరం ఏమీ-లేదు. నేను అప్పటికి ఇంకా

చాలా చిన్నవాణ్ణి. అప్పుడు ఈ చెట్టు చిన్నచిన్న కొమ్మలు పెరిగి ఆకులు తొడుగుతున్నది. నేను నా చిన్న తొండంతో ఆఆకులు కోసుకొని తింటూవుండేవాణ్ణి" అని ఏనుగు బదులు చెప్పింది.

ఆ తర్వాత కొన్నిరోజులు గడిచాయి. ఒకరోజున ఏనుగున్నూ, తితువపక్షిన్నీ కోతిదగ్గరకు వెళ్లి "మిత్రుడా! నీకు జ్ఞాపకం వున్న పురాతనమైన విషయాన్ని దేనైనా చెప్పు"అని అడిగాయి.

"అట్లాగే! వినండి! ఈ మఱ్ఱిచెట్టువుంది చూశారు, ఇది ఇంకా పెరిగీ పెరగకముందు, నేను రోజూ ఇక్కడికివచ్చి, దీనివేళ్లు పీక్కు తింటూవుండేవాణ్ణి. ఇదే నాకు బాగా జ్ఞాపకంవున్న సంగతి. నా చిన్నప్పుడు ఎప్పుడో నేను చేసిన పని ఇది." అని జవాబుచెప్పింది.

మరి కొంతకాలంగడిచింది. ఒకరోజున వానరమున్నూ, గజమున్నూ కలిసి, తిత్తిరందగ్గరకు వెళ్లాయి. వెళ్లి "బాబూ! మేము ఇద్దరం మాకు ఈజన్మలో గుర్తువున్న పురాతనమైన సంగతులు ఏమిటో చెప్పాం. నీవుగూడా కానిస్తే బాగుంటుంది" అన్నాయి.

తిత్తిరం అట్లాగేనని తన జ్ఞాపకాన్ని వివరించింది. ఇప్పుడు ఈ మఱ్ఱిచెట్టువున్నదా, ఈ ప్రాంతంలోనే ఇంకో పెద్ద మఱ్ఱిచెట్టువుండేది. నేను అసలు దానిమీద నివశిస్తూవుండేదాన్ని. అది కాసినపళ్లు తినేదాన్ని. అట్లాతిని నేనువేసిన రెట్టలోనిగింజలు మొలిచిన మొక్కే ఇది. ఆచెట్టు పడిపోయింది. నేను ఈ చెట్టుమీదకి వచ్చాను అని తితువనసమాధానం చెప్పింది.

అప్పుడు ఆ వానరమున్నూ, ఆ ఏనుగున్నూ తిత్తిరపక్షిని చూచి ఈలా అన్నాయి:"మిత్రుడా! జన్మచేత నీవు మా ఇద్దరికన్నా పెద్దవాడివి. వృద్ధుడవు. నిన్ను మేము సత్కరిస్తాము. గౌరవిస్తాం. పూజిస్తాం. అభిమానిస్తాం. ఇంతఎందుకు నువ్వు మాకు గురువవు. మేము నీకు శిష్యులము."

ఆ రోజు నుంచీ ఆ వానరము, ఆ గజము, ఆ పక్షి ఒక దాన్ని ఒకటి గౌరవించుకుంటూ, ఒకదానికొకటి సహాయం చేసుకుంటూ, ఒకదాని జీవితంలో ఇంకొకటి సహాయం పడుకుంటూ, జీవితాన్ని గడిపాయి. గడిపి, తనువులు త్యజించాయి. తనువులు త్యజించి సుగతిని పొంది స్వర్గంలో ఉద్భవించాయి.

## 5

బుద్ధభగవానుడు ఈ కథను చెప్పి "భిక్షువులారా! ఇదే తైత్తిరీయ బ్రహ్మచర్యానికి పునాది అయిన విషయం" అన్నాడు. ఆ కథను వ్యాఖ్యానించి, ఆ బ్రహ్మచర్య ధర్మం యొక్క లక్షణాలు ఏమిటో చెప్పాడు. ఆ మూడు జంతువులు ఐదు మహాశీలాలను అనుసరించాయి. ఒకటి, తమలో వృద్ధి డెవరో విచారించి, ఆవృద్ధుణ్ణి గౌరవించాయి. రెండు, అవి ఒకదానిని ఒకటి గౌరవించుకున్నాయి. మూడు, ఒకదానికొకటి సహాయం చేసుకున్నాయి. నాల్గు, సహజీవనంగా, సహాయానంగా బ్రతికాయి. ఐదు, ఒకదాన్ని ఒకటి విడువకుండా విహారం గల్పాయి. ఈ ఐదు మహాగుణాలు వున్న ధర్మాన్నే తైత్తిరీయ బ్రహ్మచర్యంఅంటారు. ధర్మం యొక్క లక్షణం ఇది. ధర్మం తెలుసుకొని, ఏ మనుష్యులు వృద్ధుల్ని గౌరవిస్తారో, వారికి ఈ జన్మలో ప్రశస్తి కల్గుతుంది. పర

(౬౬-వ పేజీ చూడండి)




బ్యాటరీలు

NAS E3

సకల దంత వ్యాధులకు

కోతిమార్కు

నల్లపండ్లపొడి



ప్రతిచోట దొరకును

నోగి అండ్ కో

87 చైనాబజార్ రోడ్, మద్రాసు-1

స్టాకిస్టులు: ట్రేడ్ ప్రమోటింగ్ కార్పొరేషన్, పోస్టుబాక్సు 50, గాంధీనగర్, బెజవాడ.

#  ముచ్చటగా ముగ్గురు 

(33-వ పేజీ తరువాయి)

ఎక్కడో దూరంగా ఒక గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

"మన పడవ ఏ రేవులో వదిలిపెట్టామో నీకేమైనా జ్ఞాపకంవుందా?" అని జార్జి నన్ను అడిగాడు.

"లేదురా!... అసలు యిక్కడ ఎన్ని రేవులు వున్నాయేమిటి?" అని నేను వాణ్ణి అడిగాను.

"ఆఁ! ఆట్టే లేవు: నాలుగే లే! అయినా హారిస్ను మేలుకొనివుంటే యిబ్బంది ఏమీ వుండదు!" అన్నాడు జార్జి.

"అవుననుకో— వాడు మేలుకొని వుండకపోతే...?-" వాడు మేలుకొని వుండకపోతే మాగతి ఏమౌతుందో వూహించుకోవటంకూడా యిష్టంలేక అంతటితో ఆవూసు మానేశాం.

మొదటి రేవుదగ్గర నిలబడి హారిస్ను పేరుపెట్టి యిద్దరమూ పిలిచాం. సమాధానం రాలేదు. రెండో రేవుకి వెళ్లి అక్కడ కేకేశాం, అక్కడా సమాధానం రాలేదు.

"ఆఁ! ఇప్పుడు జ్ఞాపకం వచ్చిందిరా! మన పడవకి.. మూడో రేవులోరా, లంగరేసింది. పదపద!" అంటూ జార్జి నన్ను తొందరచేశాడు.

పరుగు పరుగున మూడో రేవుకిపోయి మళ్లీ కేకవేశాం.

సమాధానం రాలేదు!

మా పరిస్థితి విషమించి పోతున్నది. అప్పటికే అర్థరాత్రి దాటిపోయింది. పోని నాలుగుమైళ్లూ వెనక్కి నడిచి వూళ్లోకి వెళ్దామూ అంటే, వూళ్లో హోటళ్లన్నీ అప్పటికే మూసేసి వుంటారు. అదికాకపోతే పోనీ - ఎవరికొంపలోనైనా పడుకోనిస్తారేమో అడుగుదామనుకొన్నా, అర్థరాత్రి నిద్రలేపితే ఎవడైనా విరుచుకు పడతాడేకాని, ఒక్కడూ పడుకోడానికి చోటు యివ్వడు. 'పోనీ — వూళ్లోకివెళ్లి ఎవడైనా ఒక పోలీసు కనబడితే వాణ్ణి పట్టుకుతన్నేమా అంటే, వాడు మననిఎల్లాగూ ఈ రాత్రికి జైల్లో పడేసిపెడతాడు: మన సమస్య తీరిపోతుంద'ని జార్జి సూచించాడు. కాని అంతలోనే ఒక అనుమానం వచ్చింది. మాచేత దెబ్బలుతిన్న పోలీసు, జైలుకి పట్టుకుపోకుండా, ఎదురుతిరిగి మమ్మల్ని చావచిదక కొట్టి వీధిలోకి విసిరి పారెయ్యడని నమ్మకం ఏమిటి ? ఎంత ఓపికవున్నా పోలీసువాడితో రాత్రి రాత్రిఅంతా పోట్లాడుతూనే వుండగలమా? కాకపోయినా— ఏపని చేసినా మితిమించి చేయకూడదు. అలా చేశామో— ఒక్కరాత్రి బంధిఖానా చాలని మేమనుకొంటే, వాళ్లు మమ్మల్ని ఆరునెలలు అందులోనే పడేసిపెట్టేస్తారు.

చీకట్లో దేవుళ్లాడుకొంటూ నాలుగో రేవుకి వెళ్లాం. అక్కడా మా ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు. వాన బాగా ఎక్కువైంది. ఇప్పట్లో వదిలేటట్లుకూడా లేదు. మేము అప్పటికే పూర్తిగా తడిసి, ఒణికిపోతున్నాం. అసలు యిక్కడ రేవులు నాలుగేనా అనీ, యివి రేవులేనా అని, అది ఆవూరేనా అనీ, యిలా ఏమిటోమిటో శంకలు మమ్మల్ని పట్టుకొని వేధిస్తున్నాయి. కన్ను పొడుచుకొన్నా కనిపించని ఆ కటికచీకటిలో ఒకసారి చూసిన వస్తువులే పోలిక దొరక్కుండా పోతున్నాయి.

చివరికి యిక పూర్తిగా ఆశలు వదులుకోబోతూవుండగా— (అవును, నవలల్లోనూ నాటకాల్లోనూ యిలాటివన్నీ పూర్తిగా ఆశలు వదులుకొన్న తరువాతే జరుగుతాయి: ఆ విషయం నాకూ తెలుసు. అయినప్పటికీ మా పడవ ప్రయాణంలో ఎప్పుడు ఏ విషయం జరిగిందో అదంతా ఒక్క పిసరైనా మార్చకుండా రాయాలని అనుకొన్నాను— అంచేత అలా వ్రాయక తప్పటంలేదు: రాస్తున్నాను.)

సరిగ్గా ఆ సమయానికే మేము ఆశలు పూర్తిగా వదిలేసుకొన్నాం. సరిగ్గా అప్పుడు ఏమైందంటే— నదికి అవతలగట్టుకి దగ్గరగా మిణుకు మిణుకుమంటూ పడవ లాంతరు ఒకటి నా కంటికి కనిపించింది. ముందుగా అదేదో కొరివిదెయ్యమేమోనని కంగారుపడ్డాను. కాని— కాదు. మా పడవలో లాంతరే అది. దాని వెలుతురునుబట్టే నేను పోల్చుకోగలను. వెంటనే ఒక్క గావుకేక పెట్టేశాను. నా అరుపులకి ఆకాశమే అల్లాడిపోయింది.

కేకవేసి క్షణంసేపు యిద్దరమూ వూపిరి బిగ

పెట్టి విన్నాం. మాంట్ మొరన్సీ మారుపలికింది. దాని అరుపులు మా చెవులకి ఆ క్షణంలో అమర గాయకుల కంఠంలోనుంచి వెలువడ్డ సుస్వనంలా విని పించింది. వెంటనే పడవ కదలింది. నిద్రమత్తువదలని కంఠస్వరంతో హారిస్సు 'ఎక్కడ వున్నారురా, మీరు?' అని కేకపెట్టాడు,

అప్పటి మా పరిస్థితిలో పడవని మా దగ్గరికి నడిపించుకు రావటానికి హారిస్సుకి గంటపైగా పట్టినట్లని పించింది కాని, నిజానికి ఐదు నిమిషాలకంటే ఎక్కువ అయివుండక పోవచ్చు. తీరా ఒడ్డుదాకా తీసుకొచ్చిన పడవని, వాడు, మేము ఎక్కటానికి వీలులేనిచోట నిలబెట్టేసి, తాను మళ్ళీ నిద్రకు పడ్డాడు.

మళ్ళీ వాడికి మేలుకొలుపులు పాడేసరికి మా కంఠ నాళాలు బద్దలైపోయాయి. ఏదో నానా తంటాలుపడి ఎల్లాగైతేనేం పడవలోకివచ్చి పడ్డాం.

బోటులోకి వచ్చాక హారిస్సువంక పరీక్షగా చూద్దుముకదా, వాడి మొఖంమీద విషాదమేఘాలు అలుముకొని వున్నట్లు అవుపించింది. 'మేము లేన ప్పుడు ఏమైనా జరిగిందా?' అని వాడిని అనునయంగా అడిగాం.

"హంసలు;" అన్నాడు హారిస్సు.

'హంసలు ఏమిటిరా' అని అడిగితే, మేము వెళ్ళిపోయాక తను పడవని నదిమీద నడిపించుకు పోయి హంసల గూడుదగ్గిర లంగరువేశాననీ, అక్కడ వున్న ఆడహంస ఒకటి వీడిమీదికి విరుచుకు పడిందనీ, తానెల్లాగో దాన్ని తరిమేస్తే అది పోయినట్లేపోయి మళ్ళా మొగహంసను వెంటపెట్టుకు వచ్చిందనీ, ఆ రెంటి తోనూ తను యుద్ధంచేసి జయించాననీ చెప్పాడు. మళ్ళీ అరగంట గడిచేలోగా పద్దెనిమిది హంసలు ఒక్కసారిగా ఎగిరి మీద పడ్డాయన్నాడు. పద్దెనిమిది హంసలతో ఒక్కడు యుద్ధం చేయటం సామాన్య మైన విషయంకాదు. ఆ పద్దెనిమిది హంసలూ వీణ్ణీ, మాంట్ మొరన్సీనీ పడవలోనుంచి బయటికి లాగి నీళ్ళల్లో ముంచెయ్యాలని చాలా ప్రయత్నించాయట. అయినప్పటికీ తనుమాత్రం పెద్ద వీరుడిలా నాలుగు గంటలసేపు పోరాడి, పద్దెనిమిది హంసలనీ కొట్టి చంపిపారేశాననీ చెప్పాడు.

"ఎన్ని హంసలు వచ్చాయన్నావ్?" అని జార్జి అడిగాడు.

"ముప్ఫైరెండు." అన్నాడు హారిస్సు.

"అదేమిటిరా? ఇప్పుడేగా పద్దెనిమిదన్నావ్?"

"లేదు: పద్దెనిమిది అనలేదు. మొత్తం పన్నెండే! నాకేం లెక్కలు రావనుకొన్నావా?" అన్నాడు హారిస్సు కోపంగా.

అసలు ఎన్నిహంసలు వచ్చాయో మాకు బోధపడలేదు. మర్నాడు వుదయం హారిస్సుని అడి గితే "హంసలు ఏమిట్రా? మీరేమైనా కలగంటు న్నారా!" అని వాడూ మాతోపాటు విస్తుపోవటం మొదలుపెట్టాడు.

(ఇంకా వుంది)

అమ్మకమునకు సిద్ధముగానున్నది.




అనువాదం: తెన్నేటి సూరి

వెల రూ. 3. ఆంధ్ర గ్రంథమాల, మద్రాసు 1.



శ్రీ రాజరాజేశ్వరి ఫిలిమ్స్ వారి "లక్ష్మి"లో గిరిజ.



ప్రకాష్ పిక్చర్సువారి "చైతన్యమహాప్రభు"లోని ఒక దృశ్యంలో కన్నయ్యలాల్.

వున్నా మనకి అతని వెదుకులాట హాస్యాస్పదంగా కనిపించేది; రసోత్పత్తికి బదులు రసాభాస జరిగేది.

దీన్నే మరొక విధంగా వివరిస్తాను. ఆంగ్లేయ రచయిత జాన్ బన్యన్ "పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్" అనే నవలలో, దురాశ, వివేకం, పాపం, పుణ్యం ఇలాటి కొన్ని భావాలు తీసుకుని వాటికి మనుషుల పేర్లు పెట్టి వ్రాశాడు. వాటికి మనుషుల పేర్లు పెట్టినా, ఆ భావాలు భావాలుగానే ఉండిపోతాయి కాని మానవపాత్రలు కాలేవు. అందుచేత ఆ నవల చదువుతుంటే మనం రచయిత ఏ ప్రయోజనంతో వ్రాశాడో దాన్ని హర్షించగలం తప్ప, ఆ భావాలతో తాదాత్మ్యస్థితి పొందలేము. ఎందుచేతనంటే ఆ భావాలకు యాథార్థ్యం లేదు. అక్కడ *exaggeration* ఉన్నది. మన మనస్సు భావస్థితిలోనే ఉన్నంతకాలమూ, రసోత్పత్తి జరగదు.

అందుకే మన చిత్రాల్లో ఒక పెద్దలోపం కనిపిస్తుంది. చెడ్డతనం అనే ఒక భావం తీసుకుని ఒక పాత్రనూ, మంచితనం అనే భావం తీసుకుని ఒక పాత్రను సృష్టిస్తారు. లోకంలో వున్న యావత్తు చెడ్డతనమూ, యావత్తు మంచితనమూ ఆ పాత్రలకి అంటగడతారు. అటువంటి వ్యక్తులు లోకంలో ఎక్కడా తగలరు కనుక మనం ఆ పాత్రలలో లీనం కాలేము. ఇక్కడ కూడా *Exaggeration* జరిగింది; కనుకనే రసాభాస కలుగుతుంది.

* * *

బలరామకృష్ణగారికి డిటెక్టివ్ నవలలపై గౌరవం ఉండడంలో నాకేమీ ఆక్షేపణ లేదు. ఈరకం నవలలకు సారస్వతంలో స్థానం లేదని నా అభిప్రాయం కాదు. కానన్ డాయిల్ రచనలు శిల్పదృష్ట్యా చాలమంచివే; వాటిలో రచయిత కనబరచిన మేధాశక్తి, తార్కికశక్తి హర్షించదగినవే. అయినా అవి వాస్తవిక రచనలూ కావు, టాల్‌స్టాయ్ మొదలైనవారి రచనలతో పోల్చదగినవీ కావు. అసలు షెర్లాక్ హోమ్స్ పాత్ర ఊహాకల్పితమే కాని దైనికజీవితంలో మనకి తారసిల్లడానికి వీలున్న పాత్ర కాదు.

డిటెక్టివ్ నవలలే కాదు, మరి ఏ నవల వ్రాయడానికైనా, అసలు ఏపని చేయడానికైనా కొంత నేర్పు, తెలివితేటలు అవసరమని నేనుకూడా భావిస్తున్నాను. అంతమాత్రాన తరతమ భేదాలు ఉండకుండా పోవు.

* * *

వాస్తవిక కళలో 'ఎంటర్‌టెయిన్‌మెంట్' తప్పక వుంటుందనీ కాని వినోదింపజేసేది ప్రతిదీ కళ కాదనీ, క్రిందటివారం "అదీ — ఇదీ" శీర్షిక క్రింద



మద్రాస్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి "రోహిణి"లో మాధురీ దేవి.

## ★ ఆదీ—ఇదీ ★

వ్యాసంలో వ్రాశాను. దీన్ని మరికొంత విపులంగా వ్రాస్తాను. ఉదాహరణకి సర్కస్, గారడీ, మెస్మరిజం మొదలైన ప్రదర్శనలు ఎంతైనా వినోదం కలిగిస్తాయి. ఈ వినోదం నిరాక్షేపణీయమైనది. కాసేపు వాస్తవ జీవితాన్ని మరిపించడానికి, మెదడుకు విశ్రాంతి ఇవ్వడానికి ఇవి ఉపకరిస్తాయి. అయితే ఈ ప్రదర్శనలలో ఏదీ కళ కాదు. ఎంత ప్రయత్నించినా వీటిని కళగా మార్చడం సాధ్యం కాదు. ఎందుచేత? కళను నిర్వచిస్తూ, కళాకారుడు తన జీవితానుభూతులను తోటివారితో పంచుకునేందుకే కళాసృష్టి చేస్తాడని వ్రాశాను. ఈ నిర్వచనం ప్రకారం చూస్తే, సర్కస్ మొదలైనవి కళలు కాజాలవు. వాటిలో ఏ జీవితానుభూతినీ చిత్రించాలనే ప్రయత్నం కనబడదు. అవి కేవలం వినోదంకోసం ఉద్దేశించబడినవి; వినోదమే పరమావధిగా కలవి.

చలన చిత్రాలను వినోదంకోసమే తయారు చేస్తున్నామని వాదించే నిర్మాతలున్నారు. వారి దృష్టిలో చలన చిత్రాలకూ, సర్కస్‌కూ ఆట్టే తేడా లేదు. వారికి చలనచిత్ర నిర్మాణం ఒక కళ కానేకాదు. ఈ దేశంలో వినోదాన్ని గూర్చి నిర్మాతలెవరికీ స్పష్టమైన అభిప్రాయాలు లేవు. అందుచేతనే వినోదానికి సంబంధించిన ఎన్ని 'ఫార్ములా'లున్నా, ఈ ఫార్ములాలతో తయారైన చిత్రాలు అపజయం పొందుతున్నాయి.

చలనచిత్రం అచ్చగా కళ. సర్కస్‌ను ఎంత ప్రయత్నించినా కళగా ఎలా మార్చలేమో, అలాగే ఎంత ప్రయత్నించినా చలనచిత్రం సర్కస్‌గా మారదు. చలన చిత్రం అన్నతరవాత, చలనచిత్ర కళకు సంబంధించిన సూత్రాలు పూర్తిగా పాటించి తీరాలి. చలనచిత్రం ద్వారా కావలసినంత 'ఎంటర్ టెయిన్‌మెంట్,' వినోదం కలిగించడానికి వీలున్నది. అయితే ఇది ఆ కళా సూత్రాలకు అనుగుణంగానే జరగాలి గాని, వాటిని ఉల్లంఘిస్తూ జరిగితే, అది అపజయం పొందుతుంది. ఈ కళా సూత్రాలను పాటించక పోవడం మూలానే, వినోదదాయకములని భ్రమించి, మన నిర్మాతలు తీసే చిత్రాలు విఫలమవుతున్నాయి.

ఐజెన్ స్టీన్ ఒకచోట ఇలా వ్రాశాడు:

"చిత్రణవిధానంద్వారా ప్రేక్షకుల మనస్సులను ఆకట్టివుంచి, మొదటినుండీ చివరిదాకా వారికి తాము చూసేదానితో తాదాత్మ్యం కలిగించే చిత్రాలు ఉండే రోజుల్లో మనము వినోదాన్ని గురించి తర్జనభర్జనలు జరపలేదు. అప్పుడు మనకి విసుగు కలిగేదాకా కూడా వ్యవధి ఉండేది కాదు. ఇలా తాదాత్మ్యం కలిగించే శక్తి ఎక్కడో ఎప్పుడో మనం పోగొట్టుకున్నాం. అప్పుడు వినోదాన్ని గూర్చి చర్చించడం ప్రారంభించాము. చూసేదానితో ప్రేక్షకులకు తాదాత్మ్యం కలిగించడం మనకి చేతకానంత కాలమూ, మనం వినోదం కూడా ఇవ్వలేము. ఈ శక్తిని మనం తిరిగి సంపాదించుకుని, కళలో దాన్ని ప్రవేశపెట్టాలి. ఇందులో మనకి ఎవరూ సహాయం చెయ్యరు. మనకి మనమే సహాయం చేసుకోవాలి." ★



## 'రత్నదీపం'

పాడుకావటానికీ, పాడుచేయటానికీ అవతల అన్ని అవకాశాలు వున్నప్పటికీ పవిత్రమైన ఏ ఒక్క జీవితపు విలువపట్లనైనా గౌరవభావం వున్న వ్యక్తి, ఎలా ఆత్మవంచన చేసుకోలేడో నిరూపించేందుకు ప్రభాత కుమార్ ముఖర్జీ, బెంగాలీలో 'రత్నదీప్' అనే నవలను రచించాడు.

ఆ నవలను ఆధారంగా తీసుకొని ప్రఖ్యాత బెంగాలీ దర్శకుడు దేవకీబోసు

(50-వ పేజీ చూడండి)

వి. యు. బి. యల్. నరసింహం—బద్వేల్.

భరణీవారి "చండీరాణి"లో పిల్లలకు పెండ్లి చేసినట్లు చూపించడములో దర్శకురాలి అభిప్రాయ మేమిటి?

—ప్రచండుడు తన వెర్రి సరదా తీర్చుకోవడంకోసం ప్రజలపై అన్యాయంగా పన్నులువేసి బాధిస్తున్నాడని సూచించడానికి పిల్లలపెళ్ళి ప్రవేశపెట్టారు. ఆ పెళ్ళి అంత వైభవంగా, వివరంగా చూపించడం "ప్రేక్షకుల ఎంటర్ టెయిన్ మెంట్"కోసమని మనం సమాధానపడాలి.

* * *

క. కామేశ్వరరావు—దినాపూర్.

"దేవదాసు" తెలుగు చిత్రంలో పార్వతికి వివాహమైనదగ్గరనుండి మేలిముసుగుతో చూపించారు. ఇది ఏ దేశ ఆచారప్రకారము చూపించారు?

—అది ఉత్తర భారతీయాచారము; తెలుగు ఆచారం కాదు.

* * *

వాగోజి గోపినాథ్—హాస్పేట.

దేవదాసులో "కులం తక్కువవాళ్ళనీ, పిల్లలను అమ్ముకొనే వంశమని" దేవదాసు తండ్రి నిరాకరిస్తాడు. అయితే, వేరే జమిందారు (సి.ఎస్.ఆర్) పెళ్లి చేసుకొంటాడు. ఆయన ఈ విషయాలను గమనించడా? ఇప్పుడుకూడా కట్నంఇచ్చి పెళ్లిచేస్తారు కదా, పిల్లలను అమ్ముకొన్నట్టు కాదా?

—పార్వతిని పెళ్ళిచేసుకున్న జమీందారు తన పిల్లలసంరక్షణార్థం పెళ్ళిచేసుకోవాలనే తొందరలో ఈ విషయాలేమీ గమనించి ఉండకపోవచ్చు. సాధారణంగా కట్నం యిచ్చేది ఆడపిల్లతండ్రి. అందుచేత అది ఆడపిల్లను అమ్ముకొన్నట్టు కాదు. అలా కాకుండా ఆడపిల్ల తండ్రి పెళ్ళికొడుకునుంచే డబ్బుపుచ్చుకుని పిల్లనిస్తే అది పిల్లను అమ్ముకొన్నట్టవుతుంది. ఈ ఆచారం పురస్కరించుకునే "కన్యాశుల్కం" నాటకం కూడా వ్రాయబడింది.

* * *

పి. వెంకయ్య శెట్టి—శ్రీనివాసపురము.

ప్రస్తుతము భక్తిరస చిత్రములను గురించి స్టూడియోలవారు ఏలాటి జోక్యము పుచ్చుకోవటంలేదు. కారణం ఏమిటండి?

—అగ్రనిర్మాతలలో ఒకరైన శ్రీ ఎస్. ఎస్. వాసన్ ఇటీవలనే "అవ్వయ్యార్" ఆంధ్రదేశంలో విడుదలచేశారు. ఇది భక్తి, నీతిప్రధానమైన చిత్రం కాదా? ఈచిత్రం విజయవంతంగా నడిచిన పక్షంలో మన నిర్మాతలు మళ్ళీ అలాంటి చిత్రాలకేసి తిరుగుతారు.

విజయా వారి "పాతాళ భైరవి" చిత్రములో తోటమాలి రాజకన్యను వివాహము చేసికొనెను. అట్లు ఎక్కడైనా తోటమాలికి, రాజకన్యకు వివాహము జరుగుతుందా?

—అదొక్కటే కాదు, "పాతాళభైరవి"లో చూపించిన ఇంకా అనేక విషయాలు జరగవు. జరిగితే బాగుండునని మనం సామాన్యంగా అనుకొనే అపూర్వ విషయాలు జరిగినట్లు చూపించడమే "పాతాళభైరవి" విజయరహస్యం.

వి. పట్టాభి రామారావు—జమ్‌షెడ్పూర్.

"దోభిఘాజమీన్" రెవ్యూలో, శంభూ భార్య కలకత్తా రావడం కాడ్రీ చేతిలో ఆమె చిక్కి బలాత్కరించబడడం, ఆమె పారిపోతూ కారుక్రిందబడడం వగైరా, కథతో సంబంధంలేని సీక్వెన్సుక్రింద పేర్కొని దురదృష్టవశాత్తు దర్శకత్వములో చోరబడ్డ చిన్నలోపములలో ఇది ఒకటి అన్నారు. అదే రెవ్యూలో, శంభూ భార్య పుత్రులతో స్వగ్రామం తిరిగి వచ్చేటప్పటికి అతని పొలంలో బ్రహ్మాండమైన ఫ్యాక్టరీ నిర్మించబడి ఉంటుందన్నారు. శంభూభార్య కారుక్రిందపడి ఆస్పత్రిలో మరణించినదేగాని, అతనితో స్వగ్రామం తిరిగి రాలేదే! ఆమె మరణించినప్పటికి, అది అనవసరమైన సీక్వెన్సే అని మీరు అభిప్రాయపడుతున్నారా?

—మీరు చూసిన కాపీలో శంభూభార్య

(52-వ పేజీ చూడండి)



జెమినీ వారి "అవ్వయార్"లో తల్లిదండ్రులచే వదిలివేయబడిన అవ్వై బ్రాహ్మణ దంపతులకు దొరికిన దృశ్యం.

"రోహిణి" చిత్రంలో మాధురీదేవి, జి. వరలక్ష్మి.

## 'రత్నదీపం'

(48-వ పేజీ తరువాయి)

లో గడచ హిందీలోనూ బెంగాలీలోనూ రెండు చిత్రాలు తీశారు. అదే చిత్రానికి యిటీవల మద్రాసులో తమిళ సంభాషణలు, పాటలు కూర్చి తమిళ ప్రాంతంలో విడుదల చేశారు. విడుదల చేయబోయే ముందు (ఈనెల 10) భరణీ స్టూడియోలో పత్రికలవారికి 'ప్రివ్యూ' యిచ్చారు.

నాటి సమావేశంలో ప్రసంగించిన దేవకీబోసు, భారతీయ నాగరికతనీ సంస్కృతినీ ప్రతిబింబించే చిత్రాలు - ఏ ప్రాంతం వారైనా - భారతీయులందరినీ ఆకర్షించి తీరుతాయన్నారు. భారతీయ నాగరికతలో స్త్రీల శీలానికి గల పవిత్రతని యీ చిత్రం చాలా చక్కగా నిరూపిస్తున్నది కనుక, భారతీయ భాషలలో ఏభాషలో తీసినా యీ చిత్రం విజయవంతమయ్యే అవకాశం వుంది. ఈ భావాన్ని వ్యక్తీకరించటంలోనూ, కథను తెరకెక్కించటంలోనూ దేవకీబోసుగారి ప్రతిభ ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది.

ఇందులో ప్రధాన భూమికలు నిర్వహించిన అనుభ, మంజు, అభి భట్టాచార్జి ప్రశంసనీయంగా నటించారు. ఇతర సాంకేతికాంశాలు కూడా లోటులేని విధంగా వున్నాయి. 

## "అవ్వయ్యార్"

జెమినీవారి భక్తిప్రధాన తమిళ చిత్రం "అవ్వయ్యార్" ఆంధ్రదేశంలో విడుదల అయ్యే సందర్భంలో ఇటీవల జెమినీ స్టూడియోలో పత్రికా ప్రతినిధులకు చూపబడింది. నిర్మాత శ్రీ ఎస్. ఎస్. వాసన్; దర్శకుడు కొత్తమంగళం సుబ్బు; తెలుగు కామెంటరీ శ్రీ వేవులపల్లి కృష్ణశాస్త్రి; కథావివరణ శ్రీమతి కన్నాంబ, శ్రీ నాగభూషణం పెద్ద సత్యం.

ఈచిత్రం, నిర్మాతగా వాసన్‌గారికి అఖండ గౌరవం చేకూరుస్తున్నదనీ, ఇది చలనచిత్ర పరిశ్రమకు అమూల్యాలంకారమనీ, దేశంలో నైతికమైన విలువలు నశించిపోతున్న యీ తరుణంలో భక్తిప్రబోధకమైన యీ చిత్రం వెలువడటం ఎంతో వాంఛనీయమనీ, పత్రికలే కాక, ప్రభుత్వోద్యోగులు, ప్రజాప్రముఖులు, యోగులు, స్వామిజీలు ముక్తకంఠంతో ప్రశంసించారు.

ప్రాచీన తమిళ కవయిత్రి, దైవభక్తి ప్రచారకురాలు అయిన అవ్వయ్యార్‌ను గూర్చి తమిళదేశంలో వ్యాప్తిలో వున్న కథలను, గాథలను పురస్కరించుకొని వాసన్‌గారు ఈ చిత్రం తీశారు. దైనిక జీవి

తంలో ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ అనుసరించదగిన సామాన్యధర్మాలను అవ్వయ్యార్ సులభగ్రాహ్యమైన పాటల, పద్యాల రూపంలో బోధించింది. తన ఉపదేశాల వలన దుర్మార్గులైన మహారాజులను, పండితులను, పామరులను సన్మార్గులుగా చేసింది. దేశంలో దైవభక్తి వెదజల్లింది. ఆమె ఉపదేశాలకు భగవంతుడు ఎప్పటికప్పుడు అండగా నిలిచి, ఎన్నో మహిమలు ప్రదర్శించి, ఆ ఉపదేశాలకు బలం చేకూర్చాడు. ఇదంతా అనుశ్రుతంగా వచ్చే ప్రసిద్ధగాథ. దీన్ని కొద్ది మార్పులతో వాసన్ గారు చిత్రించారు.

అవ్వయ్యార్ చారిత్రక వ్యక్తి. అయినా భగవంతునికి భూలోకంలో ఏకైక ప్రతినిధి వలె సంచరించింది. ఆమె వ్యక్తిగత జీవితాన్ని గూర్చి హేతువాదబద్ధమైన వివరాలేమీ ఉన్నట్లులేదు. ఈ కారణంవల్లనే గాబోలు యీ చిత్రంలో ఆమె మానసిక జీవితాన్ని, పాత్ర పరిణామాన్ని చిత్రించడానికి ఎట్టి ప్రయత్నమూ జరగలేదు. అందుచేతే, శాస్త్రాల తరబడి మనకు సుపరిచితమైన నీతులు, ధర్మాల వల్ల మనం ఆకర్షించబడతాం తప్ప, వ్యక్తిగా ఆమె మనకు దగ్గిరిగా రాదు. మనకు భగవంతుడు ఎంత అనభిగమ్యుడో, వ్యక్తిగా అవ్వయ్యార్ కూడా అంతే.

కె. బి. సుందరాంబాళ్ అవ్వయార్‌గా నటించింది. గంభీరమైన ఆమె నటన అవ్వయ్యార్ పాత్రకు జీవంపోసింది. ఆమె కాక ఎమ్. కె. రాధ, తులసి, మున్నగు పలువురు ఈ చిత్రంలో నటించారు. ★

## సినిమా వార్తలు

### "రాజా పేదా"

మార్క్ ట్వేన్ రచించిన ప్రసిద్ధనవల "రాజా పేదా" కథ తీసుకుని, శ్రీ బి. ఏ. సుబ్బారావుగారు తెలుగులో చిత్రం నిర్మిస్తున్నారు. కొన్నాళ్ళక్రిందట వాహినీ స్టూడియోలో షూటింగ్ ప్రారంభమైంది. మొదట పేదబాలుడి నివాసం సెట్‌లో ప్రారంభించారు. ఈ చిత్రాన్ని సుబ్బారావుగారే డైరెక్టు చేస్తున్నారు. ఫోటోగ్రఫీ ఆదీ ఇరానీ; సంగీతం శ్రీ రాజేశ్వరరావు; మాటలు శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి; పాటలు శ్రీ తాపీ ధర్మారావు; ఆర్ట్ వాలి.



తల్లి దుర్బోధలువిని వెంగళరావు పార్వతిని ఇంట్లోంచి వెళ్ళగొడుతున్నాడు.
శ్రీ రాజరాజేశ్వరీవారి "లక్ష్మి"లో హేమలతమ్మారావు, రేలంగి, కృష్ణకుమారి.

# ★ సినిమా వార్తలు ★

ఈ కథను భారతీయ వాతావరణాని కనుగుణంగా మారుస్తున్నారు. కథలో కూడా కొన్ని మార్పులు చేస్తున్నారని, తెలుస్తున్నది. మహారాజుగా ఎస్. వి. రంగారావు, మంత్రిగా ఆర్. నాగేశ్వరరావు, పేదబాలుడి తండ్రిగా కోటేశ్వరరావు, తల్లిగా లక్ష్మీరాజ్యం, పేదబాలుడి సోదరిగా గిరిజ నటిస్తున్నారు. కథలో రాజకుమారుడికి చివరిదాకా రక్షకుడుగా నిలిచిన మైల్స్ హెండన్ (తెలుగులో పెట్టిన పేరు 'సుధీర్') పాత్రకు సికిందరాబాదు నివాసి మిస్టర్ లక్ష్మణ్ అనే యువకుని బుక్ చేశారు. రాజకుమారుడు, సరిగ్గా అతన్నే పోలివుండే పేదబాలుడు పాత్రలకు కవలపిల్లలిద్దర్ని బుక్ చేశారు. ఈ పిల్లల నటనమీదే చిత్రం విజయం ఎక్కువగా ఆధారపడి వుంటుంది గనక వారిపై పూర్తి శ్రద్ధతీసుకోదలచామని సుబ్బారావుగారన్నారు.

* * *

వినోదావారి "దేవదాసు" తెలుగుచిత్రం త్వరలో సుమారు తొమ్మిదికేంద్రాల్లో శతదినోత్సవం జరుపుకోనున్నది. ఈ సందర్భంలో "దేవదాసు" యూనిట్ వారు అన్ని కేంద్రాలూ పర్యటిస్తారని తెలుస్తున్నది.

* * *

గోదావరి వరద బాధితుల సహాయార్థం మద్రాసులోని నటీనటుల్లో అధిక సంఖ్యాకులు ఆంధ్రదేశంలో పర్యటించనున్నారు. నాటక ప్రదర్శనలద్వారా వీరు సొమ్ము సేకరిస్తారు. దీనికోసం సినిమా ప్రముఖులందరూ చేరి చురుకుగా సన్నాహాలు సాగిస్తున్నారు. ★


## నారసింహ లేహ్యము




బంగారు చేర్చబడినది మేహము, నిర్వీర్యత, నిస్సత్తువ, శుక్ల నష్టమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

20 తు॥ డబ్బి రు. 8-4-0 పోస్టేజి 15 అ.

కె. వి. వి. & కంపెని. "ఆయుర్వేదసమాజం" పెరిడపి- నెల్లూరు జిల్లా.



మా నూతన ప్రచురణ

**HOW TO SPEAK & WRITE CORRECTLY.**

ఇంగ్లీషులో వ్రాయబడినది 228 పేజీలు: వెల రు. 2/- పోస్టేజి అ. 10/-

A S. MONEY & CO (A P.)
14, Sanibier St., Madias 1.


# ప్రశ్నలు - సమాధానాలు

(49-వ పేజీ తరువాయి)

మరణించి వుండవచ్చు. మద్రాసులో చూపించబడిన కాపీలో ఆమె మరణించలేదు. మొదట తయారుచేసిన చిత్రంలో ఆమె మరణం చూపించారనీ, అందువల్ల చిత్రంలో ట్రాజెడీ మరీ దుర్భరంగావుండి ప్రేక్షకులను తృప్తిపరచలేదన్న శంకతో నిర్మాతలు ఆమె బ్రతికే వున్నట్లుగా మార్చారనీ తెలుస్తున్నది.

* * *

జవ్వాది వెంకటరామారావు—కోరుమిల్లి.

భూతల స్వర్గం అంటే ఏమిటి? అది ఆంధ్రలో ఎక్కడ వుందో తెలవిస్తారా?

—భూతలస్వర్గం అంటే భూమిమీద ప్రత్యక్షంగా కనబడే స్వర్గలోకమని అర్థం. ఎన్నికలు దగ్గిరపడినకొద్దీ రాజకీయ నాయకుల ప్రచారప్రసంగాల్లో ఇది సాక్షాత్కరిస్తూ వుంటుంది. ★

తండ్రి : పాపా ! రోజూ రేడియోలో హిందీ పాఠాలు శ్రద్ధగా వింటున్నావా?

కూతురు : వింటున్నా నాన్నా.

తం : అయితే చెప్పు, తుమ్హారా నామ్ క్యాహై?

కూ : గు...ర్ గుర్ గుర్ గుర్, మేరానామ్...గర్ గర్ గర్......పాపాహై.

తం : ఆ గురగురలుకూడా ఏమిటే ?

కూ : రేడియోలో అలాగే పాఠాలు చెపుతారు నాన్నా!

— సూర్య, అమలాపురం.

* * *

మేష్టారు: పదహారవశతాబ్దమునకు చెందిన కవులనుగురించి మీకేమైనా తెలుసునా?

ఒకవిద్యార్థి : తెలుసునండీ!

మే : ఏమిటి?

విద్యార్థి : వారందరూ చనిపోయారండీ.

—సుంకర మురళి, విజయనగరము.

# నిర్విఘ్నగమనం

(9-వ పేజీ తరువాయి)

ఇల్లు వస్తుంది. నోట్లో నాలుగు కబళాలు ప్రవేశిస్తాయి. మళ్ళీ యేదో గంట కొడుతుంది గడియారం. అసలు యింతకీ తాను బయలుదేరి యెంత టైమయిందో! కంగారు. అడుగులు వడివడిగా పడతాయి, గుమ్మం దాటుతాడు. ఆఫీసు ప్రత్యక్షం. మహోన్నత శిఖరం ముంగున్న ఉడతలా-మిడతలా తన్ను భావన చేసుకుంటాడు. మెట్లపై అడుగు వేసేందుకు క్కూడా సాహసం కావాలి. కుర్చీలో కూలబడి చెమటోడుస్తాడు. కలంలో సిరా ఉందో, లేదో! నిన్నటి కాగితాలు ఆఫీసరుచూసేడో లేదో! మధ్యాహ్నం తనకు కాఫీ అలవాటు లేదు. సూర్యాస్తమానం అయితే తనకు దీపం గత్యంతరం. వెధవ తాలూకా ఆఫీసని! బుడ్డే! - కనీసం లైటైనా లేదు. చీకటి కోణాలు పెంచుతూ ఉంటుంది రూము. వెలుగు తిరిగి చీకట్లో చికాకు విదిలిస్తుంది. నల్లగా గొట్టాంనుండి వస్తున్నట్టు పొగ మొహంమీద కొస్తుంది. దీపం బుడ్డి స్థావరం మార్పు చేస్తాడు. ఇహ ఎవరూ లేరు. కొంచెం నీరసంగా ఉంటుంది. పోనీ రేపు చూసుకుందా మనుకుంటాడు.

రోడ్డుమీద తనకన్నా వేగంగా చాలమంది నడుస్తున్నారు. తానూ నడక నేరుస్తున్నాడు. ప్రక్కని రూంలో పంకా రంయ్‌మని తిరుగుతూఉంటే సిగరెట్టు పొగ ఒదుల్తున్నాడో కాయన. లేదు పొమ్మంటూంటే కానీ కోసం పడికాపులు పడి కాలుమీద వాలుతోంది ఒకమ్మాయి. చీకటి రేకులు చీల్చలేక నీరసించే దీపం చాటున గబగబా మేదరి నేస్తం బుట్టలు అల్లుతూ పక్కనున్న చంటిపాపతో చక్కని హాస్యం చేసేడు. నాలుగు రోజులమధ్య పాతుకుపోయిన పోలీసు కళేబరం చేతులు చూపుతూ నేఉంది. కాని ఆ మొహం నవ్వుతోంది. ఆ నవ్వే తన్ను వెంబడిస్తోంది. తన్ను వేటాడుతోంది. ఇంట్లో వెంకట్రావ్ యీజీచైర్‌లో సిగరెట్ పొగ వొదుల్తున్నాడు. పక్కయింటి పిల్లలు గొల్లుమని ఆడుతున్నారు. ఆరోజు మరిరోజు కింద మారకుండా రామం తన కార్యక్రమానికి తుదిపలుకు పలకాలి (?) ★



తాత్కాలిక "రాజధానికర్నూలు" లో ప్రభుత్వోద్యోగుల నివాసానికై ఏర్పాటు చేయబడిన డేరాలు.

# ★ కాలక్షేపం ★

(5-వ పేజీ తరువాయి)

హాంగా "ఛల్ ఛల్ రే నౌ జవాన్" అని పాటపాడుకుంటూ నాన్న మంచం వద్దకు నవ్వుతూ వచ్చాడు. తల్లి ఏడుస్తూఉంది.

"ఏరా! నాయనా! నాన్న ప్రాణం పోతూఉంటే ఇంకా పాటలు పాడుతున్నావా?" అని మరింత ఏడ్చింది కుమారుని ఖులాసా పాటలు విని—

కాని నరసింహం చరచర తండ్రి మంచం వద్దకు వచ్చి ఆయన తలవద్ద తనతల పెట్టి "నాన్నా! నాన్నా!" అన్నాడు. "వచ్చావా నరసన్నా" అని కుమారుని తల తడివి చూచాడు. అదేసమయంలో తండ్రి చెవిలో నరసింహం అతిరహస్యంగా ఇలా చెప్పాడు. "నాకు క్రాస్‌వర్డుపజిల్లో పాతిక వేలరూపాయలు బహుమానం వచ్చింది. నేడు పత్రికలో చదివాను. పైకం పదిరోజులలో వస్తుందిట" అని మెల్లమెల్లగా చెవి కొరుక్కు వట్లు, చెవిలోమందు చుక్కలుచుక్కలుగా వేసినట్లు, చక్కగా చెప్పాడు. ఆమాటలు వినేసరికి శంఖం ఊదినట్లుగా శంకరం "ఆ! నరసన్నా!" అని కన్ను తెరచి చూచాడు. "దాహం!" అన్నాడు. పల్చని పాలు చెంచాతో కొంచెం కొంచెంగా తండ్రి నోట్లో నరసన్న పోశాడు. ఆనాడు నాడి పుష్టిగానే ఉన్నదని డాక్టర్లు అన్నారు. గండం తప్పిందనిన్నీ, గ్రహస్థితి మంచిదనిన్నీ, పునర్జన్మ అనిన్నీ, శంకరం భార్య మెడలోని తాడు గట్టిదనిన్నీ, మందిచ్చిన డాక్టరుగారి హస్తవాసి ప్రశస్తమైనదనిన్నీ అందరూ అనేకవిధాలుగా శంకరంగారి పునరారోగ్యానికి అనేక కారణాలు చెప్పారు. ఆయన ఆరోగ్యం ఒక మండలం దాటిన పిమ్మట ఎండిన మాను చిగిర్చినట్లయింది. ఆయన "దాహం!" అనగానే పెద్దకొడుకు పాలు త్రాగించినప్పుడే ఆయన తన ప్రాణం లేచివచ్చిందన్నాడు. ఆయన నోరు ఎండిపోయింది గనుక ఆ దాహానికి ఆహుతి పడింది అన్నారు. పాతిక వేల రూపాయీల క్రాస్‌వర్డ్ పజిల్ బహుమానం వచ్చిందనగానే తిరిగి జవసత్వలు శంకరంలో అంకురించాయి. ఆయనకు తృష్ణఉండడం మూలంగానే మూడు కోర్టులూ తిరిగాడు. తృష్ణ ఉండడం మూలంగానే "తృష్ణ యొక టే తరుణత బూనెన్". తిరిగి దాహం తీరిన తర్వాత తరుణయౌవనం ప్రాప్తించినట్లుగా వ్యవహారాలన్నీ చూచుకుంటూ, "చల్ చల్ రె నౌజవాన్" (నడువుమోయి! నడువుమోయి! నవయౌవనుడా!" అంటున్నాడు. ★

ఒక గంటలో యౌవ్వనము
కామస్తంభన
ధాతుపుష్టి, సంసారసుఖము నిచ్చుటలో సాటి. లేనిది. నిరాశచెందిన వృద్ధులయందు శక్తి ఉత్సాహము నిచ్చును. రు. 2-8-0.
మదనమంజరి ఫార్మసీ
184, రైనాబజారు రోడ్డు మదరాసు-1.
బెజవాడ-శ్రీనివాస మెడికల్‌స్టోర్స్-పాత్రరోడ్డు
రాజమండ్రి-ఈశ్వరదాస్ & కో. మెయిన్‌రోడ్డు
వెల్లూరు:- ఆర్యన్ ఫార్మసీ-ట్రంకురోడ్డు
ఇతర కేంద్రాల్లో ఏజెంట్లు కావాలి.

కస్తూరి మాత్రలు.
గోరోజన మాత్రలు
వసంత మాత్రలు.
మా మందుల జాబితాను కోరుడు.

# ★ ఇంతలో ఉంది ★

(8-వ పేజీ తరువాయి)

అంటుగిన్నెలు తోముకోవడంలో ఆమె ఇష్టమేదో ఆమెదేకాని పైవాళ్లు ఏం చెప్పినా ఆవిడకు లెక్కలేదు. రోజూ తల్లీ కూతురికీ ఆ విషయంలో పోట్లాటే. కూతురు అంటుంది. "వందసార్లు స్నానం చేస్తేనూ, రోజల్లా గిన్నెలు కడుక్కుంటేనూ పుణ్యం రాదు. లేనివాళ్ళకింత చేత్తో పెట్టుకుంటే అదేకూడా వచ్చేది" అని. అయితే ఆమెకీ (వెంకట్రావు భార్య) ఆచారమే కాని అంత వల్లమాలిన చాదస్తం లేదు. ఇద్దరికీ ఒకరిమాట ఒకరికి నచ్చదు. ఇద్దరికీ రోజూ ఇంట్లో యుద్ధాష్టకం.

వెంకట్రావు అన్నమాట ముసలమ్మ గ్రహించింది. ఆవిడ ఊరుకోదల్చుకోలేదు.

"ఇంతవరకూ పనిమనిషి రాలేదు. ఇక ఎంతసేపని కనిపెట్టుకొని వుండను? అమ్మాయి మడిగట్టుకుంది. నీకు అన్నం ఉడికింది" అంది.

"ఇవాళంటే పనిమనిషి రాలేదు. రోజూ ఇంతకుముందు వంటయి అఘోరిస్తోంది గనకనా! ఇందాకటి నుంచి ఆ తగరపు గిన్నె తెగ తోముతున్నారు. అది మీ చేతిలోనే అరిగిపోతుంది. చెబితే వినాలి. ఇంక ఆ గిన్నె అక్కడ పెట్టండి" అన్నాడు వెంకట్రావు.

"పెడతాలే" అంది ముసలమ్మ, ఇంకా గిన్నె తోముతూ.

"ముందు అక్కడ పెట్టండి" అని మళ్ళీ రెట్టించాడు వెంకట్రావు.

ఆవిడ తనపని మానలేదు.

"చెబితే వినాలి - పెద్దాళ్ళకీ లేదు చిన్నాళ్ళకీ లేదు చెప్పినమాట వినే అలవాటు-" అని ఇంకా ఏవేవో అంటుంటే, భార్య వంటింట్లోంచి ఇవతలకొచ్చి—.

"ఆవిడ చెబితే వింటుంది గనకనా! మీ నోరు, నా నోరు నొప్పి కాని - అయినా అంటుగిన్నెల గోల దగ్గర్నుంచీ మీకెందుకు? ఆడాళ్లు చేసికొనే పనుల్లో అడ్డు వచ్చి 'చెయ్యకండి' అంటే ఎలాగ? మీకనవసరమైన గొడవలేదీ ఇంట్లో - ప్రతీదీ మీకే కావాలి! ఏంచావో!" అంది మందలింపుగా భర్తని.

"ఈ ఇంటిగొడవ నాకు కాకపోతే ఊళ్ళోవాళ్ళకా! ఇంకా ఊళ్ళోవాళ్ళే చెప్పిన మాట విని ఏంకావాలంటే నిమిషాల మీద చేసిపెడతారు. ఈ ఇంట్లోవాళ్ళే ఏపనీ వినిపించుకోరు. నెత్తెక్కుతున్నారు. వెధవ గోల" అని వెంకట్రావు సణుక్కుంటూ, అప్పటికి వంటింట్లో అన్నం ఒక్కటే ఉడకడం చూసి, ఆకలికోపంతో గదిలోకి వచ్చి, కిటికీదగ్గర వాల్చి ఉన్న పడక కుర్చీలో నీరసంగా రెండు చేతులూ వెనక్కి వేసికొని, కాళ్లు రెండూ గోడకి తన్ని పెట్టి కునుక్కు వేసరికి, వీధిగుమ్మంలో ఎవరో అరుస్తున్నారు - వినిపించింది.

ఇంకెవరు? ముష్టివెధవ! అప్పటికి పది గంటల ముప్ఫైఐదు నిమిషాలు అయింది. అలా కూర్చునే, ఓపిక తెచ్చుకొని "పోరా! పో!!" అన్నాడు వెంకట్రావు. వాడు కదల్లేదు. ఇంకా వంద చదువుతున్నాడు. విసుగ్గా మరో రెండుమూడు సార్లు పొమ్మని చెప్పిచూశాడు వెంకట్రావు. వాడిమాటలు వాడివే కాని వెంకట్రావు పొమ్మనడం ముష్టివాడికేం విని పించటల్లేదు. ముష్టివాడి మాట వెంకట్రావుకీ వినిపించదు. వెంకట్రావుకైతే ఇంట్లో వాళ్ళని ఎదుర్కోలేక నీరసం వచ్చేసింది కాని ముష్టివాడికి ఏమీ నీరసంలేదు. వెంకట్రావు వందసార్లు పొమ్మని కసిరినా, బింకంగా కదలక "ఎందుకు వెయ్యరు?" అనే ధీమా యేమో, ముష్టివాడు ఎంతసేపైనా సరే ముష్టి వేయించుకొని మరీ కదిలేలా నిలబడి అరుస్తున్నాడు. ఎన్ని తిట్లకీ వినకపోతే విసుగ్గా వెంకట్రావు లేచి డబ్బాలో బియ్యం గుప్పెడు వాడికివేసి వీధి తలుపు దగ్గరగావేసి వాడిని వదిలించుకొని మళ్ళీ నీరసంగా కుర్చీలో కూలబడ్డాడో లేదో, వీధి తలుపు తెరుచుకున్న చప్పుడైంది.

తలుపుకేసి చూడకుండానే నీరసంగా "ఎవరు వారు?"

ఆ వచ్చినవారెవరో మాటా పలుకూ లేదు. సమాధానం లేకపోవడంచూసి మళ్ళీ పిలిచాడు — ఊహూ - కొంచెం గూటివైపు తలవంచి చూశాడు. వెంటనే అతని నోట అప్రయత్నంగా "ఛీ! ఛీ! ఛీ. ఆం వెనక్కి నడు - తిరుగు - తిరుగు" అనే మాటలు వెలువడ్డాయి. కుక్క ఒకటి, తను కూడ ఆ ఇంట్లో మనిషినే అన్నంత దర్జాగా, తన కేమీ ఎదురు లేదన్నట్లు సందులోంచి దొడ్డివైపుకు వస్తూంది. వెంకట్రావు 'ఛీ! ఛీ! ఛీ! నడు నడు!" అంటూనే నీరసం వచ్చి అనలేక అలానే కూర్చునిపోయి చూస్తున్నాడు కాని, కుక్కమాత్రం ఆ ఛీ! ఛీ లు తనని కాదన్నట్లుగా, అవి వెంకట్రావు జీవితంలో కనిపించే రోతైన సంఘటనలు భరించలేక అలా అంటున్నట్లుగా, ఏమీ వినిపించుకోకుండా, మనిషంత మనిషి వెంకట్రావు అంతటి వెంకట్రావు అక్కడ ఉన్నట్లే గుర్తించక, తిన్నగా దొడ్డివైపుకు నడిచి వెళ్ళిపోతూంది.

కుక్క తన లెక్కలేకుండా పోతూండడం చూశాక వెంకట్రావుకి చెప్పలేనంత నీరసం వచ్చింది. "రహదారి అయిపోయింది గుమ్మం. వెధవకుక్క" అనుకున్నాడు. కుక్కని కొట్టండని ఇంట్లో ఎవళ్ళకో ఒకళ్ళకి వెంకట్రావు ఆదేశించగలడు కాని, ఆమాట వాళ్లు వినిపించుకొనివచ్చి కుక్కని కొట్టాలికదా! వెడితే వెళ్ళింది. అతనికి ఎవరినీ పిలిచే ఓపికలేదు. ఇన్నిసార్లు ఛీ! ఛీ అంటేనే దగ్గరలోంచి వెళ్ళిపోయే కుక్క లెక్కలేకుండా వినిపించుకోకండా పోతే, ఇంట్లో ఎక్కడో ఎవళ్ళపనుల్లో వాళ్ళు మునిగి ఉంటే అతని కేకక్కడ పలుకుతారు? సమయం దొరికినప్పుడు ఆ కుక్కని ఎప్పుడైనా, కసి తీరేదాకా తలుపుసందు దాన్ని నొక్కి "కుయ్యో! మొర్రో" అని ఏడిపించగలడు వెంకట్రావు.




## అతిమూత్రవ్యాధి వారం రోజులలో నెమ్మదించును

మూత్రంలో అధికంగా చక్కరపోవుట అతిమూత్రవ్యాధిఅంటారు (Diabetes) ఇది యెంత ఉపద్రవకరమైన వ్యాధిఅంటే, దీని పాలబడినవారు ఆరోజు కారోజు మృత్యువుకు ఆసన్నమౌతుంటారు. దీనికి డాక్టర్లు ఇన్‌సులిన్ ఇన్‌జెక్షన్ మాత్రమే కనిపెట్టారు. వాటివల్ల వ్యాధి పూర్తిగా నయం కానేకాదు. ఇన్‌జెక్షన్ల గుణము వున్నంతకాలం మాత్రం చక్కెర తాత్కాలికంగా నిలిచిపోతుంది. ఈజబ్బు లక్షణాలలో ముఖ్యమైనవి దాహం, ఆకలి, తరచుగా చక్కెరతో మూత్రం బయలు వెడలటము. దురద మొదలైనవి ఈ వ్యాధి ముదిరితే రాచపుండు, కురుపులు, కంటిపొర ఇతర చిక్కులు సంభవించును. వీనస్ ఛారమ్ ఆధునిక శాస్త్రంలో అద్భుతమైన చికిత్స. దీన్ని వాడటం వల్ల వేనకు వేలమంది మృత్యుముఖంనుండి బయటపడ్డారు. దీన్ని వాడితే రెండవ లేక మూడవ రోజునుండే మూత్రంలో చక్కెర తగ్గించి అత్యధికమూత్రం గూడ నివారిస్తుంది. మూడు రోజుల తరువాత మీకు బాగా తేలికవుతుంది. దీనికి పత్యం లేదు. ఇన్‌జెక్షన్లు అవసరం లేదు. ఇంగ్లీషులో వివరములుగల కరపత్రానికి వ్రాయండి. ఉచితంగా పంపుతాము.

50 బిళ్లల బుడ్డి ఖరీదు రు. 6-12-0 లు

ప్యాకింగు పోస్టేజి ఉచితము

వీనస్ రిసెర్చి లేబరేటరీ,

పోష్టుబాక్సు నం. 587, కలకత్తా (A. P. W.

# రూపాయిలూ - అణాలూ

(21-వ పేజీ తరువాయి)

ఒక్కసారి నుదురు జివ్వుమన్నది.

నెమ్మదిగా జ్ఞాపకం రాసాగింది సుందరానికి ... సాయంత్రం తాను రోడ్డుమీద నడుస్తూంటే - సైకిల్ ...బ్రేకులు పట్టలేదు ...తాను పరిగెట్టాడు ప్రక్కకి - పడ్డాడు ...రాయి నుదురికి - బలంగా...

ముఖంఅంతా చెమట పోసింది...మళ్ళా అతను అర్ధ చేతనస్థితిలోకి జారిపోయాడు...

"మీ అడ్రస్ తెలీక - నిన్నటిదాకా *Wire* చెయ్యలేదండీ - నిన్నను తెలివి వస్తే అడిగాను..."

ఎవరొచ్చారని కళ్ళు తెరిచి చూశాడు సుందరం...అవును - శశి ..

ఆమె నిర్వికారంగా గదిలోకి వచ్చి తన సామాను లోపల పెట్టించింది. అతనామె వైపే చూస్తున్నాడు. జట్కావాడిని డబ్బులిచ్చిపంపి, ప్రక్కగదిలో ఉన్న గోపాలం దగ్గరికి వెళ్లి - "డాక్టర్ ఏమన్నాడు?" అన్నది.

"కొంచెం-ప్రమాదం ఉంటేమోనని.." విచారంగా, అనుమానంగా చెప్పాడు గోపాలం...

"అహాఁ..."

శశి పొడిగా అన్నది. గోపాలం ఇంటికి వెళ్లినట్లుంది - శశి తిరిగి ఆ గదిలోకి వచ్చింది. మంచంమీద సుందరం. తలకి కట్టు మాత్రం వుంది.

ఆమె అటు చూసింది.

అతను మళ్ళా కళ్లు తెరిచాడు-కొంచెం శక్తి వచ్చినట్లుంది. ఆమెవైపు చూశాడు.

"ఏమైనా కావాలా?"

నర్సులాగ-నిర్వికారంగా అడిగింది శశి.

"ఆ!...నువ్విలాగ రా"

నెమ్మదిగా వెళ్లి అతనిప్రక్క నిలబడింది శశి.

"ఆ కోటుజేబులో తాళాలు ఉంటాయి ...నా పెట్టి తీసి, అడుగున ఎర్ర కవరు ఉంటుంది తీసుకురా..."

కొద్ది నిముషాలలో శశి అలా చేసింది.

అతను కవరు తీసుకుని నెమ్మదిగా మంచానికి జేరబడి కూర్చున్నాడు.

"నాకు—ప్రాణభయం ఉందటగా?"

"తెలీదు."

"డాక్టర్ ఉందని చెప్పాడు."

"అనుమానం..."

"కాదులే—నాకు తెల్సు..."

శశి హృదయం ఒక్కసారి విరుచుకున్నది—కాని పైకి ఆమె నిర్వికారంగానే కూర్చున్నది.

అతను ఆ కవరులోనించి ఓ కాగితం తీశాడు...అది అతని ఇన్సూరెన్సు పాలిసీ...పదివేలకి.

"చూడు"

శశి నిర్జీవంగా తీసుకుని చూసింది. ఆ విషయం ఆమె కింతకుముందు తెలీదు.

"ఈ పదివేలూ—ఎవరివంటావ్ ?"

శశి అర్థం కానట్లు చూసింది.

"*Nearest kin*...అంటే భార్య... చూడు శశీ...ఒక టడుగుతాను చెప్పు... ఒక జీవితం ఖరీదెంత అంటావు ?"

ఆమె మాట్లాడలేదు.

"నా జీవితం ఖరీదు ? ... నీకు చాలా తక్కువ అని నాకు తెల్సు...కాని—పదివేలు...నాకు చాలా సంతోషంగా ఉంది శశీ...బ్రతికి ఉన్నన్నాళ్ళూ నీ కోరికలు తీర్చలేకపోయాను—సరిగా క్లెయిమ్ పెడితే రెండునెలల్లో వొస్తుంది డబ్బు—పదివేలు !!"

అతను ఆ కాగితాన్ని కవర్లో ఉంచి ఆమె కిస్తూ, "తీసుకో" అన్నాడు.

శశి చెయ్యి జాపలేదు.

అతను బలంగా ఆమె చెయ్యి తీసుకుని ఆ కవరు వ్రేళ్ళమధ్య ఉంచాడు...ఒక్కసారి శశి రెండుచేతులతోనూ ఆ కవర్ని పట్టుకుంది...

"మీ—పగ కాదూ ?"

అతను వికటంగా చిరునవ్వు నవ్వాడు.

"ఛా...నువ్వంటే నాకు చాలా ప్రేమ శశీ !...నీకు కావాల్సింది నీ కివ్వాలి... నా జీవితంపోతే అది ఖరీదు..." అతని గొంతు గాద్గదికం అయింది.

శశి తొందరగా కవర్ని అతని ప్రక్కన ఉంచింది...నిర్విణ్ణ అయి ఆమె చూస్తోన్నది.

"మీ బ్రతుకు—పదివేల ఖరీదు మీకూ కంపెనీ వాళ్లకే కావొచ్చు..నాకు కాదు.."

"ఇంకా—"

"అవును—నాకే మూర్ఖత్వం అంటగడుతున్నారో దానితోనే మీరు బాధపడుతున్నారు...ఒక జీవితం విలువ ఎంత అని అడిగారు...చెప్పండి—ఒక మనస్సు విలువ ఎంతా ?"

అతను మాటలాడిలేదు...

"బంగారు తెరలలోనించీ ఏమీ కనిపించవు. హృదయాలని జాలితో అర్థం చేసుకో ప్రయత్నించకపోతే ఏమీ కనిపించవు, మీ ఉద్దేశం - నేను డబ్బుకోసం మీతో - దెబ్బలాడేననేగా?"

..................

"నాన్నా ! నువ్వింకా పొడుగు పెరుగుతున్నావా?"

"లేదురా, నేను పెరగడం మానేసి చాలాఏళ్ళయింది."

"అహా, జుట్టు కత్తిరించుకుని నీతలకాయ పైకొస్తుంటే అలా అనుకున్నాను."

"అవును - జీవితాలకీ, మనసులకీ, మనుష్యులు రూపాయలూ అణాలతో విలువ కట్టినంతకాలం బ్రతుకులు మన బ్రతుకుల లాగే వెలుగుతూ ఉంటాయి ... నేను విడ్చినది మీ వందలకోసం కాదు ... దాని వెనుకఉన్న నిర్లక్ష్యంకోసం ... మీ డబ్బు కోసం కాదు...దాన్ని మీరు 'బ్రాకీ' తీటుస్తారు...కాని, నాకు కావాల్సింది మనస్సు ...అందుకనే మీ ఉద్దేశం తెలిశాక మీతో జీవించలేననే నిర్ణయానికి వచ్చాను - వెళ్ళిపోయాను"

సుందరం ఒక్కసారి ఆమెవైపు చూసి తలదించుకున్నాడు.

"ఆవిషయం నువ్వు చెప్పలేదు..."

"మీ కళ్ళకి కనిపించినవి రూపాయలూ అణాలూ...ఈ విషయాలు వాటిలోనించి కనిపించవు. ఇప్పుడు ఆ తెరలు కొంచెం తొలగించాను - అంతే...మనస్సు ఖరీదు - మనస్సే"

"బాగా కనిపిస్తోంది శశీ..."

అతను పశ్చాత్తాపంతో అన్నాడు... బాధ అతని ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

"కాకపోయినా బాధలేదు..."

"శశీ!..."

"అవును ... మనస్సులూ కాలమూ పరిగెట్టేది ఒక్కదిక్కులోనే! వనక్కిరావు ......"

"వొస్తాయి శశీ...మనం తెల్చుకుంటే... పొరపాటుపడినా, క్షమించడం మానవత్వం ......"

"వొద్దులెండి - మానవత్వంమీగి ఉపన్యసించకండి...మీ కేమీటలు ఎన్నడూ చెప్తానుకోలేదు - కాని ఉద్రేకం ఆపుకోలేకపోయాను...మీరింక పడుకోండి"

"పడుకుంటాను శశీ—నాకు తెల్సును. కాని, నువ్వు నన్ను మనసారా క్షమించావను...శాంతిగా కళ్లు మూసుకుంటాను."

"అనను...అననని మీకు తెల్సును"

"చనిపోయేవాళ్ళమీద కూడా నీకు జాలి లేదా శశీ?"

## ★ రూపాయిలూ - అకాలూ ★

"మరణం పేరువింటే నన్ను భయపెడుతున్నారు......కాని—మిమ్మల్ని ఎందుకు క్షమించాలో నాకు తెలీదు...ప్రతీవారూ మీలాగే ఆలోచిస్తారు.. అందుకని నేను మీమీద కోపం తెచ్చుకోలేదు. చెప్పానుగా—ఒక్కచోట మనం జీవించడం అసంభవం అని అనిపించింది...వెళ్ళాను. మీమీద నాకు కోపమూలేదు. మానవత్వంలో ఈ లోపాలూ ఒక భాగమే..."

"పోనీ—ఒకటి చెప్పు శశీ.. నేను చచ్చిపోతే నీకు విచారంగా ఉంటుందా?"

"మీరు చాలా దుష్కరమైన ప్రశ్న వేస్తున్నారు... నే నెలా అనుకున్నా మీకు వచ్చేలాభం ఏమిటి?"

"ఆత్మశాంతి..."

"నేను విచారించను... విచారించినా, ఇప్పటిదాకా నా జీవితం వ్యర్థం చేసుకొన్నందుకే..."

"దాంపత్యం—అంతలోదేనా?"

"మనసూ మనసూ కలిసిన దాంపత్యాలు దాంపత్యాలు...పుస్తె కట్టినంతమాత్రాన కాదు. దేశాచారాలని మనం అనుసరించాం...రెండు ఎడ్లని ఒక బండికి కట్టినట్లు మనని కలిపారు...అంతే..."

"నీ—గుండెల కాఠిన్యం తల్చుకుంటే, ఆశ్చర్యం వేస్తోంది శశీ!"

"నిజం ఎప్పుడూ అలాగే ఉంటుంది.."

"వెళ్లు—దూరంగా పో.."

అరిచాడు సుందరం...శశి తొందరగా అవతలి గదిలోకి వెళ్ళిపోయింది. పొంగీ పొరలివస్తూన్న కన్నీళ్ళని బలంగా ఆపుకుంటూ

* * *

"లాభం లేదా డాక్టర్?"

"లేదమ్మా.. చివరి గడియలు..."

పరుగున వెళ్ళి శశి సుందరం మంచం మీద పడ్డది—తాను నిర్ధారణ చేసుకున్న నిర్లిప్తత ఆమెని ఆపలేకపోయింది; చివరి నిమిషాలలో తన మనస్సుని అమ్ముకోకూడదనే పట్టుదల ఆమెని ఆపలేకపోయింది.

సుందరం నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

ఆమె ఆవేదనతో అతనివైపు చూస్తున్నది; కళ్ళు లోతుకి పోయాయి—తలనిండా రక్తం...మృత్యుగహ్వరంలోకి అడుగుపెట్టడానికి సంసిద్ధుడుగా ఉన్న ఈ ఆఖరిసారి...తన—తన భర్త...

శశి ఇంక ఏడ్వకుండా ఉండలేకపోయింది - సుందరం నెమ్మదిగా సైగ చేశాడు..."ఏడవకు"...అన్నాడు.

చివరి సారి అతని మాటలని వినడానికి ఆమె తనని తాను సంబాళించుకున్నది.

"క్షమించవూ శశీ?"

నీరసంగా అన్నాడతను...ఆమె చేతులని తన చేతులలోకి తీసుకుంటూ...ఈ మహా విశాల ప్రపంచంలో కొద్ది క్షణాల తరువాత తానెక్కడ ఉంటాడో!...ఈ అనంత కాలమానంలో మళ్ళీ తామిద్దరూ కలుస్తారో కలియరో!

దుఃఖభారంతో శశి మాటలాడలేకపోయింది...'కాదు...కాదని తలమాత్రం ఊపింది...

"పోనీ..."

సుందరం నెమ్మదిగా అన్నాడు... నెమ్మదిగా తలక్రిందనించి ఒక పొట్లం తీశాడు...

"ఒక్క కోర్కె తీర్చు శశీ...కాదనకు"

పొట్లం నీరసంగా విప్పాడు...నెక్లెస్... గదిలోని సగం కాంతిలో కూడా తళ తళలాడుతూన్నది.

"కాంతెం వొంగు శశీ!"

దుఃఖం ఆమెతో ఘనమూ రెండు చేతులతోనూ కళ్ళుమూసుకుని అతని ముందు వంగింది...అతను నెక్లెస్‌ని ఆమె మెడకి తగిలించాడు...ఆమె చేతులు తియ్యలేదు...ఏడ్పుని ఆపుకుంటూ...,

"ఒకసారి...ఒక్కసారి ఇటు చూడు శశీ .."

శశి నెమ్మదిగా కళ్ళని ఖాళీచేసుకున్నది...అతని ముఖంలో సంతృప్తి గోచరించింది...

"ఎంత - అందంగా ఉన్నావు!"

ఆమె చేతులని మృదువుగా సుందరం తన చేతులలోకి తీసుకున్నాడు...

ఆమె మాట్లాడలేదు...నిశ్చలంగా చూస్తూన్నది...

కొద్ది నిముషాలలా నే గడిచిపోయాయ్..., నెమ్మదిగా...నెమ్మది నెమ్మదిగా అతని చేతులు ఆమె చేతులలో బిగుసుకొన్నాయ్...అదేమీ శశికి తెలియడం లేదు... మెడలోని ఆభరణం...బిగువుగా ఉన్నది.

★

## ★ తైత్తిరీయ బ్రహ్మచర్యం ★

(41-వ పేజీ తరువాయి)

లోకంలో మంచి గతులు కల్గుతాయి

తిర్యగ్జంతువులు అయివుండి కూడా ఆ వానరము, ఆ ఏనుగు, ఆ తితువు పిట్ట, అట్టి బ్రహ్మచర్య ధర్మాన్ని పాలించి ఈ జన్మలో తమ జీవితాలకు శోభను తెచ్చుకున్నాయి. చచ్చి, స్వర్గంలో సుగతిని పొందాయి కాని మనం మనుష్యులం, సువ్యాఖ్యాతమైన ధర్మాన్ని అనుసరిస్తున్న వాళ్లం, సర్వ సంసర్గాలను కోసి కావి కచ్చడాలను కట్టుకున్న వాళ్ళం, ఒకళ్ళను ఒకళ్ళం గౌరవించుకోలేకపోతున్నాం. ఒకరికి ఒకళ్ళం సహాయం చేసుకోలేక పోతున్నాం. సహజీవనం, సహయానం మనకు అందని విషయాలు అయిపోతున్నాయి. మన విహారాలు కూడా తగూల పుట్టలయి పోతున్నాయి. ఇది అప్రసన్నులను, ప్రసన్నులను చెయ్యడానికిగాని, శ్రద్ధ అంటూ ఎరుగని వారిని శ్రద్ధాళువులనుగా మార్చడానికి కాని మార్గం కాదు.

వృద్ధులను గౌరవించాలి. అభిమానించాలి. వారికి ప్రత్యుత్థానం చెయ్యాలి. వారికి నమస్కారం చెయ్యాలి. కుశల ప్రశ్నలు అడగాలి. ప్రథమ ఆసనం, ప్రథమ భిక్షా పిండం, వారికి ఇచ్చి మర్యాద చెయ్యాలి. అట్లా చేయడం నత్కృతి అనిపించుకుంటుంది. అందుకు విపరీతమైనదల్లా దుష్కృతి అవుతుంది.

బుద్ధుని ఈ గంభీరరోమపన్యాసాన్ని విని భిక్షువులంతా హృపితులయినారు. తమకు చేసిన ప్రశ్నకు, సరియైన సమాధానం ఇదేనని గ్రహించారు. అప్పటినుంచి బుద్ధుడు దిద్దిన ధర్మపథ సాధనకు ఈ తైత్తిరీయ బ్రహ్మచర్యం ఒక మార్గంగా ప్రవర్తిల్లింది.

★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St.

